# వైశ్యప్రబోధిని

## తెలుగు మాస పత్రిక









శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి దేవి

మే 1994

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్

హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి. వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

విచ్చేనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్యాన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం
✆ : 62
ప్రకాశం జిల్లా.

బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం
✆ : 3158 (S.T.D. 085195)
కర్నూలు జిల్లా.

అక్షయ మహారాజ పోషకులు : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంకిలలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫొటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రూ.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆరోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫొటో సత్రావరణములో పెట్టబడును.

రూ.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

భోజనశాల, ప్రార్థనా మందిరము, కళ్యాణ మంటపము, గోశాల, సమావేశ భవనముతో కూడా 109 వసతి గదులు గల ఈ సత్రము ఆదర్శవంతంగా నిర్వహించబడుచూ, నిత్యాన్న దానము చేస్తున్నదని తెలియజేయుటకు సంతసిస్తున్నాము.

రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రాలకు ప్రతి ఏటా ఒకటి లేక రెండింటికి రూ.50,000/-ల నుండి రూ.1,00,000/-ల వరకు ఆర్థిక సహాయము అందించాలన్న తీర్మానము సర్వసభ్య సమావేశముచే ఆమోదించబడినందున ఈ సత్రమునకు ఆర్థిక సహాయం చేసిన దాతలు పరోక్షముగా రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రములకు కూడా దానము చేసినవారు ఔతారు.

పై మూడు పద్ధతులలో ఏదో ఒక పద్ధతిన ఈ అన్న సత్రమునకు ఆర్థిక సహాయాన్ని అందించి దైవ కృపకు పాత్రులు కమ్మని సోదరులకు విజ్ఞప్తి చేస్తున్నాము.

అన్నా సుబ్బ రంగయ్య
కార్యదర్శి

పోలిశెట్టి సత్యనారాయణ
అధ్యక్షులు

**వైశ్య ప్రబోధిని**

( మాసపత్రిక )

స్థాపితము

1969



సంపుటి

25



సంచిక

9



మే–1994





సంపాదకులు :

'సంఘోద్ధారక',

'వైశ్యభూషణ'

పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి





ప్రాప్తిస్థానం

ఫోన్ : 45025

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్"

జయనగర్ కాలని,

విద్యామందిర్

తూ॥ భాగం

కడప – 516 002.


సంపాదకీయం

# పెన్నం పై నుండీ పొయ్యిలోకి

రాజా చెల్లయ్య కమిటీ ప్రతిపాదించిన 'హ్యాట్ 'పెన్నము పైనుండీ పొయ్యి లోకి' అనే సామెతను గుర్తుచేస్తూ ఉంది. 'హ్యాట్ టి.ఓ.టి. కంటే క్లిష్టతరం కావడమే ఇలా చెప్పాల్సి వచ్చింది. 'హ్యాట్' అంటే 'హాల్యూయాడెడ్ట్యాక్సు' – టి.ఓ.టి. అంటే టర్నోవర్ ట్యాక్సు.

సారా నిషేధం వల్ల వచ్చే ఆదాయము లోటును భర్తీ చేసుకొనేందుకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము గత సంవత్సరం 'టర్నోవర్ ట్యాక్సు'ను ప్రవేశపెట్టింది. ఈ టర్నోవర్ ట్యాక్సు ద్వారా సంవత్సరానికి రెండు వందల కోట్ల రూపాయల ఆదాయాన్ని సమకూర్చుకోవాలనేది టి.ఓ.టి.ని ప్రవేశపెట్టడములో రాష్ట్ర ప్రభుత్వానికి గల ప్రధాన లక్ష్యం. పది లక్షల రూపాయలకు లోపు ఆదాయం గల వ్యాపారులకు ఈ టర్నోవర్ ట్యాక్సు వర్తించదు. ఒక వ్యాపారి వార్షిక టర్నోవర్ ఆధారంగా ఈ టర్నోవర్ ట్యాక్సును 0.5 శాతం నుండి 0.2 శాతము వరకు విధిస్తారు. అమ్మకము, కొనుగోలుల ద్వారా వస్తువులు చేతులుమారే ప్రతి దశలోనూ తయారీదారుడు, పంపిణీదారుడు, టోకు, చిల్లర వర్తకులూ అందరికీ వర్తించే పన్ను విధానం టి.ఓ.టి. ఇప్పుడు అమలులో ఉన్న 1957 ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకం పన్ను చట్టములోని మూడు, నాలుగు అనుసూచులు (షెడ్యూల్సు) లోని ప్రజల నిత్యావసర వస్తువులు, వాటితో కూడ అనేక ఇతర వస్తువులనూ ప్రభుత్వం ఈ టి.ఓ.టి. నుండీ మినహాయించినప్పటికీ ఈ పన్ను ప్రభావం అనేక వస్తువుల ధరలు దిన, దిన ప్రవర్ధమానం అగుటకు

ఎంతో తోడ్పడింది. ఇందువల్ల వినియోగదారులు మరింత బరువును మోయ్యాల్సి వచ్చింది. ప్రత్యేకించి రాష్ట్రములోని వర్తకులకు ఈ పన్ను అనేక సమస్యలను సృష్టించింది. అందుకే రాష్ట్రములోని సర్వ వర్తకసంఘాలు తమ తీవ్ర నిరసననూ, అసమ్మతినీ; సమ్మెలద్వారా, ధర్నాలద్వారా ప్రభుత్వానికి తెలియజేశాయి. వర్తకలోకపు అసమ్మతినీ, అసంతృప్తినీ గుర్తించిన రాష్ట్ర ప్రభుత్వము ఈ టి.ఓ.టి.తో బాటు రాష్ట్రములోని మొత్తం అమ్మకంపన్ను విధింపు వ్యవస్థనే సులభతరం చేయాలని సంకల్పించి రాజా చెల్లయ్య కమిటీని నియమించింది. గత అక్టోబర్ నెల్లో నియమింపబడిన ఈ కమిటీ మధ్యంతర నివేదిక ఒక దానిని రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పిస్తూ అందులో టర్నోవర్ ట్యాక్సు స్థానములో వాల్యూయాడెడ్ ట్యాక్సును సూచించింది. ఇది న్యాయబద్ధమైన ప్రతిపాదన అనికూడ అందులో కమిటీ పేర్కొంది. అమ్మకం జరిగిన ప్రతి దశలోనూ ఆ దశలలోగల ఆ వస్తువు యొక్క ధరలో గల తేడా ఆధారంగా పన్నును విధించాలన్నది ఈ ప్రతిపాదనలలోని ప్రధాన అంశము. ధర అంటే వాల్యు ప్రాతిపదికగా విధించబడే పన్ను కాబట్టి దీనిని 'వాల్యూయాడెడ్ ట్యాక్సు' అన్నారు. ఒక వ్యాపారి ఒక వస్తువును రు.60/-లకు మరొక్క వర్తకునికి అమ్మాడనుకొందాము. అప్పుడు ఆ వర్తకుడు తాను అమ్మిన రు.60/-లకే పన్నును చెల్లిస్తాడు. ఆ వ్యాపారి వద్ద రూ.60/-లకు కొన్న వర్తకుడు అదే వస్తువును తిరగి రూ.75/-లకు అమ్ముతాడనుకొందాము. రెండవ వర్తకుడు తాను ఆ వస్తువును అమ్మటం ద్వారా పొందిన అధిక మొత్తము రూ.15/-లకే పన్ను చెల్లించాలి. రెండవ వర్తకుడు అదే వస్తువును తిరిగి మరొక్క వర్తకునకు రూ.80/-లకు విక్రయిస్తాడనుకొందాము. మూడవ వర్తకుడు తాను ఆ వస్తువును అమ్మటం ద్వారా పొందిన అధిక విలువ రూ.5/-లకే పన్నును చెల్లించాలి. ఇలా ఉంటుంది ఈ పన్ను విధింపు. అంటే ఒక వస్తువు అమ్మకం జరిగినపుడు ఆ అమ్మకం ధర విలువ పెరిగే ప్రతిసారీ ఆ పెరిగిన విలువపైన మాత్రమే పన్నును చెల్లించడం అన్నమాట.

ఏదైనా ప్రత్యేకమైన మినహాయింపు ఇస్తే తప్ప ఈ పన్ను విధింపు వలన వ్యాపారులందరిపైనా అధిక భారం పడుతుంది. వర్తకులు తాము అమ్మే మొదటి, రెండవ, మూడవ, నాలుగవ అమ్మకాలకు ప్రత్యేకంగా లెక్కలు వ్రాయాల్సి ఉంటుంది. అంటే ప్రతి వర్తకునికీ ప్రత్యేకంగా చిట్టాలు తయారుచేయాల్సి వస్తుంది. ఇందువల్ల ఈ విధానం మరింత క్లిష్టతరమై తనిఖీ

చేసే అధికారుల ఒత్తిళ్ళకు వర్తకులను గురి చేస్తుంది. అమ్మకం జరిగే ప్రతి దశలోనూ ప్రజలపై పన్ను భారం పడుతూ వస్తువుల ధరలు చేతులు మారే కొద్దీ పెరిగేందుకు తోడ్పడుతుంది. అందుకే ఈ పన్ను విధానాన్ని 'పెన్నము పై నుండి పొయ్యిలోకి' అనే సామెతతో పోల్చాల్సి వచ్చింది.

ఈ ప్రతిపాదన ప్రభుత్వం భావించిన రాష్ట్రములోని పన్నుల విధానాన్ని సరళతరం చేయకపోగా మరింత జటిలమూ, క్లిష్టతరమూ చేసి, అధికారుల ఒత్తిళ్ళకూ, బెదిరింపులకూ వర్తకులను బలిచేస్తుంది.

అవినీతికి తావు లేని, అధికారుల ఒత్తిళ్ళకు అవకాశము లేని సరళతమ పన్ను విధానాన్నే రాష్ట్రములోని వర్తకులు కోరుకుంటున్నారే కానీ, పై రెండింటికీ మరింతగా అవకాశాన్ని కలిగించే ఇట్టి క్లిష్ట పద్ధతిని కాదు.

అధికారుల ఒత్తిళ్ళకు జడిసే వారికి ప్రతి చిన్న విషయానికీ ముడుపులు చెల్లించు కొనుటకు విసిగి, వేసారే అమ్మకం పన్ను విధానాన్ని సరళతరమూ, సులభతరమూ చేయమని గత కొన్ని యేండ్లుగా వర్తకులు రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుకుంటున్నారు. అట్టి యెడ క్లిష్టతరమైన ఈ సరిక్రొత్త విధానం 'వ్యాట్'ను ప్రతిపాదించడములో ఔచిత్యం కనిపించదు.

రాష్ట్రములోని వర్తకులందరూ కోరుకొనేది ఒకే దశలో పన్ను విధింపు విధానాన్ని. రాష్ట్ర ప్రభుత్వము ఈ సందర్భములో గుర్తుంచుకోవాల్సిన అంశము.

చిన్న వ్యాపారులకు పన్ను మినహాయింపునూ, రిజిస్ట్రేషన్ లేకుండాను చేయమని చెల్లయ్య కమిటీ చేసిన మరో ప్రతిపాదన. ఇది ఒకరకంగా సముచితమైన ప్రతిపాదనే.

అయితే, ఈ ప్రతిపాదనను ఆమోదించే ముందు రాష్ట్ర ప్రభుత్వము ఇందు వల్ల అమల్లో ఉత్పన్నమయ్యే వివిధ సమస్యలనూ కూలంకషంగా, హేతుపూర్వకంగా పరిశీలించడం అవసరం.

## శ్రీశైలం ట్రస్టుబోర్డు మెంబరుగా 'శ్రీ భవనాశి'

కర్నూలు జిల్లా నంద్యాల పురప్రముఖులూ, ప్రముఖ స్వర్ణ వ్యాపారులూ శ్రీ భవనాశి శ్రీరామమూర్తి గారిని - ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము శ్రీశైల క్షేత్ర శ్రీ భ్రమరాంబా మల్లికార్జున స్వాముల వారి దేవాలయ ధర్మకర్తృత్వ మండలిలో సభ్యులుగా నియమించింది.

# శ్రీ దోమా వెంకటస్వామి గుప్త

ఆంధ్రభాషా సరస్వతిని అనేకానేక కావ్య భూషణాదులతో అలంకరించి, ఆరాధించిన కవ్యగ్రగణ్యుల్లో స్వర్గీయ దోమా వెంకట స్వామిగుప్త గారూ ఒకరు. గుప్తగారు మహాకవులు. మహాపండితులు. అవధానిశేఖరులు. గుప్తగారు తమ జీవిత కాలంలో 47,500 పద్యాలు వ్రాసినట్లుగా తెలుస్తూంది. వీరు వ్రాసిన మరికొన్ని గ్రంథాల పేర్లు మాత్రమే తెలుస్తున్నవి. వాటిలోని పద్య సంఖ్య తెలియుటలేదు. వాటి సంఖ్య తెలిస్తే గుప్తగారు వ్రాసిన పద్యాల సంఖ్య యింకా హెచ్చుగా ఉంటుంది. పద్యకావ్యాలనే కాక గుప్త గారు వచన గ్రంథాలు, యక్షగానాలు, స్తోత్రాలు, నాటకాలు, నవలలు, విమర్శనా గ్రంథాలు, హరికథలు కూడ వ్రాశారు. వీటన్నింటినీ బట్టి చూస్తే గుప్తగారు ఆనాటికి ప్రచారములో ఉన్న సాహిత్య ప్రక్రియలన్నింటిలో రచనలు చేసినట్లు తెలుస్తుంది. కేవలం వ్రాయడమే కాదు. ఈ ప్రక్రియలన్నింటిలో, గుప్త గారు సిద్ధహస్తులని చెప్పుటకు పెద్ద సాహసం అవసరమనిపించదు.

అవధాన విద్యలో గుప్తగారు అఖండ ప్రతిభావంతులు. ధారణాశక్తిలో వీరికి వీరేసాటి. "గుప్తగారి తర్వాత అంతటి ధారణా శక్తి కల వారు పుట్టనేలేదు." అని పరిశీలకుల ఉవాచ. ఆశువుగా ఈయన పద్యాలు చెప్తూ ఉంటే వ్రాసుకోడానికే కష్టంగా ఉండేదట. అంతటి అనర్గళధార వారిది. ఆనాటి ఆంధ్రదేశములోనే గాక పొరుగు రాష్ట్రాలన్నింటిలోనూ అవధానాలు చేశారు. గుప్తగారు తమ జీవిత కాలములో మూడువందలకుపైబడి అవధానాలు చేసినట్లు, తిరుపతి వెంకటకవుల తర్వాత గుప్తగారు చేసినన్ని అవధానాలు మరెవ్వరూ చేయనట్లుగా కూడ పరిశీలకుల భావన. వీరు తమ పదహారేండ్ల వయస్సులోనే అవధానాలు చేశారు. అవధానంలో వీరు గంటకు నూరు పద్యాలు అలవోకగా చెప్పేవారు. ఈ మాటను గుప్తగారే స్వయంగా ఇలా చెప్పుకున్నారు.

"గంటకు నూరు పద్యము లఖండ
తరంబగు ధారతో సభా
మంటప మందు నిల్చి బుధమానిత
రీతిని బల్కువాడ నీ
వంటి సుధీంద్రులెల్లరును 'వహ్వారె'
యంచును మెచ్చుచుండ, వా
ల్గంటుల మోవి తేనె వలె గ్రమ
రసంబులనీను చుండగన్"

సామాన్యంగా కాదు. వాల్గంటుల మోవితేనెవలె కమ్మని రసాలు ఊరేటట్లుగా గుప్తగారు అవధానం చేసేవారు అని కూడ ఈ పద్యం మనకు చెప్తూంది.

గుప్తగారు విద్వాన్ పరీక్షను వ్రాసేటప్పుడు పరీక్షా పత్రములోని ప్రశ్నలకు పద్యాలలోనే జవాబులు వ్రాశారట. పేపర్లు దిద్దిన అధ్యాపకులు గుప్తగారి ధారణాశక్తికి అచ్చెరువంది గుప్తగారిని శ్లాఘించి విజయ

పత్రమును అందుకొనుటకు కావలసిన గుణములను వేశారు.

"అవధానములో చమత్కారాన్ని పోషించడములో గుప్తగారు అఖండులు" అని శతావధానులు శ్రీ సి.వి. సుబ్బన్నగారి అభిప్రాయము. కేవల అభిప్రాయమే కాదు. తమ పరిశోధన గ్రంథములో వ్రాసినట్లుగా శ్రీ సుబ్బన్నగారు నాకు వ్రాశారు. తిరుపతి వెంకటకవుల తర్వాత మరుగున పడిన అవధాన విద్యకు తిరిగి జీవంపోసి అత్యున్నత స్థితిని కల్పించిన వారు శ్రీ సుబ్బన్నగారు. అందువల్ల ఈయన అన్న పై మాటలకు ఎంతైనా విలువ ఉంది. గుప్తగారు శతావధానాలూ, అష్టావధానాలూ చేశారు.

1926వ సంవత్సరములో ఇప్పటి ప్రకాశంజిల్లాకు చెందిన చిన్న గంజాములో గుప్తగారొక అవధానాన్ని చేశారు. పృచ్ఛకులలో ఒకరు "కోమటివగునీవు చిల్లర బేరము చేయక యీ సాహిత్య రంగమునకేల వచ్చితివి" అని అప్రస్తుత ప్రసంగములో అడిగారు. అందుకు సమాధానంగా గుప్తగారు ఈ పద్యాన్ని చెప్పారు.

"బేరము మాకు వచ్చినది, బేరము వీడను
నేను కూడ, నా
బేరమనంగ భవ్యసభ పేరిట నంగడి
సత్కవిత్వ వి
స్తారతరావధానపు ప్రదర్శన వస్తువు
బెట్టి ఇందుకున్
గోరుటమూల్యమున్ బ్రతుకు కోస
మనందగు యేను వైశ్యుడన్
మీరిట గోరచెప్పితిని మీసము గల్గిన
యీసడింపుడీ"

గుప్తగారు చెప్పిన ఈ పద్యము ఆయనకు గల ఆశుకవితా శక్తి, అప్రస్తుత ప్రసంగములో జవాబు ఇచ్చుటలో గల చమత్కృతితో బాటు గుప్తగారి ధిషణాహంకార వైభవాన్ని చాటుచూ ఉంది. ఈ పద్యములో 'మీసము' అనుపదాన్ని ప్రయోగించుట ద్వారా గుప్త గారు తమ అవధాన విద్యా గురువులు చెప్పిన "మీసము తీసి మీ పదసమీపమునందు ..." అను పద్యాన్ని గుర్తు చేశారు. గుప్తగారు తాము చేసే ప్రతి అవధానములోను ఈ క్రింది పద్యాలలో ఏదో ఒక దానిని చెప్పేవారు.

"సరసానేక మహాప్రబంధపటలీ
సారస్వత ప్రక్రియా
భరితో ధార కవిత్వ తత్వ విజిత
ప్రాంచత్ సురాద్యనాం
తర భణ్మంబుజ కర్ణికా ప్రవిమలన్మారంద
ధారా యశో
భరులం తిర్పతి వెంకటేశకవులన్ భావింతు
నశ్రాంతమున్"

"గరువము నూని కన్నులను గానక
యిచ్చకు వచ్చినట్లుగా
మొరిగెడు బండరండలగు మోరకులన్
తెగటార్చుకోసమై
చిరము తపంబు జేసి కవి సింహములై
యుదయించి నట్టి మా
తిరుపతి వెంకటేశ కవిధీరులకున్
తగుమౌనమస్కృతుల్ "

ఈ పద్యాలు గుప్తగారికి తమ గురువుల యెడ గల భక్తిని ప్రకటిస్తున్నాయి.

గుప్తగారు తిరుపతిలో జరిగిన అఖిల భారత ప్రాచ్యవిద్యా సదస్సులో ఒకసారి శతావధానం చేశారు. ఆ శతావధాన్ని

# శ్రీ దోమా వెంకటస్వామి గుప్త

ఆంధ్రభాషా సరస్వతిని అనేకానేక కావ్య భూషణాదులతో అలంకరించి, ఆరాధించిన కవ్యగ్రగణ్యుల్లో స్వర్గీయ దోమా వెంకట స్వామిగుప్త గారూ ఒకరు. గుప్తగారు మహాకవులు. మహాపండితులు. అవధానిశేఖరులు. గుప్తగారు తమ జీవిత కాలంలో 47,500 పద్యాలు వ్రాసినట్లుగా తెలుస్తోంది. వీరు వ్రాసిన మరికొన్ని గ్రంథాల పేర్లు మాత్రమే తెలుస్తున్నవి. వాటిలోని పద్య సంఖ్య తెలియుటలేదు. వాటి సంఖ్య తెలిస్తే గుప్తగారు వ్రాసిన పద్యాల సంఖ్య యింకా హెచ్చుగా ఉంటుంది. పద్యకావ్యాలనే కాక గుప్త గారు వచన గ్రంథాలు, యక్షగానాలు, స్తోత్రాలు, నామావళులు, నవలలు, విమర్శనా గ్రంథాలు, హరికథలు కూడ వ్రాశారు. వీటన్నింటినీ బట్టి చూస్తే గుప్తగారు ఆనాటికి ప్రచారములో ఉన్న సాహిత్య ప్రక్రియలన్నింటిలో రచనలు చేసినట్లు తెలుస్తుంది. కేవలం వ్రాయడమే కాదు. ఈ ప్రక్రియలన్నింటిలో, గుప్త గారు సిద్ధహస్తులని చెప్పుటకు పెద్ద సాహసం అవసరమనిపించదు.

అవధాన విద్యలో గుప్తగారు అఖండ ప్రతిభావంతులు. ధారణాశక్తిలో వీరికి వీరేసాటి. "గుప్తగారి తర్వాత అంతటి ధారణా శక్తి కల వారు పుట్టనేలేదు." అని పరిశీలకుల ఉవాచ. ఆశువుగా ఈయన పద్యాలు చెప్తూ ఉంటే వ్రాసుకోడానికే కష్టంగా ఉండేదట. అంతటి అనర్గళధార వారిది. ఆనాటి ఆంధ్రదేశములోనే గాక పొరుగు రాష్ట్రాలన్నింటిలోనూ అవధానాలు చేశారు. గుప్తగారు తమ జీవిత కాలములో మూడువందలకు పైబడి అవధానాలు చేసినట్లూ, తిరుపతి వెంకటకవుల తర్వాత గుప్తగారు చేసినన్ని అవధానాలు మరెవ్వరూ చేయనట్లుగా కూడ పరిశీలకుల భావన. వీరు తమ పదహారేండ్ల వయస్సులోనే అవధానాలు చేశారు. అవధానంలో వీరు గంటకు నూరు పద్యాలు అలవోకగా చెప్పేవారు. ఈ మాటను గుప్తగారే స్వయంగా ఇలా చెప్పుకున్నారు.

"గంటకు నూరు పద్యము లఖండ
తరంబగు ధారతో సభా
మంటప మందు నిల్చి బుధమానిత
రీతిని బల్కువాడ మీ
వంటి సుధీంద్రులెల్లరును 'వహ్వారె'
యంచును మెచ్చుచుండ, వా
ల్గంటుల మోవి తేనె వలె గ్రమ
రసంబులనీను చుండగన్"

సామాన్యంగా కాదు. వాల్గంటుల మోవితేనెవలె కమ్మని రసాలు ఊరేటట్లుగా గుప్తగారు అవధానం చేసేవారు అని కూడ ఈ పద్యం మనకు చెప్తోంది.

గుప్తగారు విద్వాన్ పరీక్షను వ్రాసేటప్పుడు పరీక్షా పత్రములోని ప్రశ్నలకు పద్యాలలోనే జవాబులు వ్రాశారట. పేపర్లు దిద్దిన అధ్యాపకులు గుప్తగారి ధారణాశక్తికి అచ్చెరువంది గుప్తగారిని శ్లాఘించి విజయ

పత్రమును అందుకొనుటకు కావలసిన గుణములను వేశారు.

"అవధానములో చమత్కారాన్ని పోషించడములో గుప్తగారు అఖండులు" అని శతావధానులు శ్రీ సి.వి. సుబ్బన్నగారి అభిప్రాయము. కేవల అభిప్రాయమే కాదు. తమ పరిశోధన గ్రంథములో వ్రాసినట్లుగా శ్రీ సుబ్బన్నగారు నాకు వ్రాశారు. తిరుపతి వెంకటకవుల తర్వాత మరుగున పడిన అవధాన విద్యకు తిరిగి జీవంపోసి అత్యున్నత స్థితిని కల్పించిన వారు శ్రీ సుబ్బన్నగారు. అందువల్ల ఈయన అన్న పై మాటలకు ఎంతైనా విలువ ఉంది. గుప్తగారు శతావధానాలూ, అష్టావధానాలూ చేశారు.

1926వ సంవత్సరములో ఇప్పటి ప్రకాశంజిల్లాకు చెందిన చిన్న గంజాములో గుప్తగారొక అవధానాన్ని చేశారు. పృచ్ఛకులలో ఒకరు "కోమటివగునీవు చిల్లర బేరము చేయక యీ సాహిత్య రంగమునకేల వచ్చితివి" అని అప్రస్తుత ప్రసంగములో అడిగారు. అందుకు సమాధానంగా గుప్తగారు ఈ పద్యాన్ని చెప్పారు.

"బేరము మాకు వచ్చినది, బేరము వీడను
నేను కూడ, నా
బేరమనంగ భవ్యసభ పేరిట నంగడి
సత్కవిత్వ వి
స్తారతరావధానపు ప్రదర్శన వస్తువు
బెట్టి ఇందుకున్
గోరుటమూల్యమున్ బ్రతుకు కోస
మనందగు యేను వైశ్యుడన్
మీరిట గోరచెప్పితిని మీసము గల్గిన
యీసడింపుడీ"

గుప్తగారు చెప్పిన ఈ పద్యము ఆయనకు గల ఆశుకవితా శక్తి, అప్రస్తుత ప్రసంగములో జవాబు ఇచ్చుటలో గల చమత్కృతితో బాటు గుప్తగారి ధిషణాహంకార వైభవాన్ని చాటుచూ ఉంది. ఈ పద్యములో 'మీసము' అనుపదాన్ని ప్రయోగించుట ద్వారా గుప్త గారు తమ అవధాన విద్యా గురువులు చెప్పిన "మీసము తీసి మీ పదసమీపమునందు ..." అను పద్యాన్ని గుర్తు చేశారు. గుప్తగారు తాము చేసే ప్రతి అవధానములోను ఈ క్రింది పద్యాలలో ఏదో ఒక దానిని చెప్పేవారు.

"సరసానేక మహాప్రబంధపటలీ
సారస్వత ప్రక్రియా
భరితో ధార కవిత్వ తత్వ విజిత
ప్రాంచత్ సురాద్వానాం
తర భణ్మంబుజ కర్ణికా ప్రవిమలన్మారంద
ధారా యశో
భరులం తిర్పతి వెంకటేశకవులన్ భావింతు
నశ్రాంతమున్"

"గరువము నూని కన్నులను గానక
యిచ్చకు వచ్చినట్లుగా
మొరిగెడు బండరండలగు మోరకులన్
తెగటార్చుకోసమై
చిరము తపంబు జేసి కవి సింహములై
యుదయించి నట్టి మా
తిరుపతి వెంకటేశ కవిధీరులకున్
తగుమౌనమస్కృతుల్ "

ఈ పద్యాలు గుప్తగారికి తమ గురువుల యెడ గల భక్తిని ప్రకటిస్తున్నాయి.

గుప్తగారు తిరుపతిలో జరిగిన అఖిల భారత ప్రాచ్యవిద్యా సదస్సులో ఒకసారి శతావధానం చేశారు. ఆ శతావధాన్ని

స్వయంగా చూచిన శ్రీ కల్లూ సుబ్రహ్మణ్యంగారు చెప్పిన మాటలు వారి మాటల్లోనే చెప్పు కొందాము. "గుప్తగారి ఆనాటి ఆశతావధానాన్ని నేను అప్పుడు తిరుపతిలో చదువు కుంటూ చూశాను. ప్పృచ్ఛకుల మధ్య తిరుగుతూ అవధానం చేస్తున్న తీరు నాకు ఒక గున్నయేనుగు పిల్ల తిరిగినట్లుగా కన్పించింది. గుప్తగారు గొప్ప ప్రతిభావంతులు. సంస్కృతాంధ్రాలు బాగా చదువు కున్నవారు.".

గుప్తగారానాటి కవి పండితుల్లో తొలిపీటవేసి గౌరవించ దగినవారు. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లభాషల్లో ఆయన అనర్గళ ప్రావీణ్యాన్ని సంపాదించారు. ఆయన అమెరికన్ ప్లాటునను సరించి వ్రాసిన 'లీలావతి' అను గ్రంథం గుప్తగారికి ఆంగ్లభాషలో కూడ మంచి ప్రావీణ్యం కలదని చెప్పేందుకు ఆధారము. గుప్తగారికి బెంగాలీభాష కూడ వచ్చు. రవీంద్రుని చిత్రరచనను తెనిగించుటను బట్టి ఈ విషయము తెలుస్తూంది.

ఆంధ్ర భాషా చరిత్రలో తన పేరును సువర్ణాక్షరాలతో లిఖించుకొన్న ప్రతిభా వంతులూ, యశోవిరాజితులూ గుప్తగారు. ఆంధ్రభాషాయోషకు ఈయన సమ కూర్చినన్ని అమూల్యా భరణాలను 19, 20 శతాబ్దాలకు చెందిన కవులెవ్వరూ సమకూర్చ లేదు. పూర్ణ ప్రజ్ఞులగు గుప్తగారఖండ మేధావులు. ఉద్దండ పండితులు. దిగ్దంతి సన్నిభులగు కవివరేణ్యులు. పరిశోధనా ధురీణులు. అవధాన పంచాననులు. పద్యాన్నీ, శ్లోకాన్నీ కూడ అలవోకగా అప్రయత్నంగా చేప్పేవారు. దాన్ని చూచి కవీశ్వరులు, పండితులు గుప్తగారి ధారణా శక్తిని ప్రశంసించేవారు.

గుప్తగారు తమ కవితా వ్యవసాయానికి తన పదవ కొండవ యేటనే ఏరు వాకను సాగించారు. ఈ విషయాన్ని ఆయనే ఇలా ఒక పద్యములో చెప్పుకొన్నారు.

"పదకొండేండ్ల వయస్సు నుండి కవితా
వ్యాపారమున్ బూనియున్
పదియారేడుల నుండి యవధానంబుల్
రహింజేయుచున్
సద సద్వేత్తలు మెచ్చ సముదంచ
గ్రంథముల్ వ్రాయ నో
ప్పుదు శ్రీ రామకృపా కటాక్ష
విసరప్రోల్లాస మేపారగన్"

గుప్తగారిది సంస్కృతాంధ్రముల మిశ్రమరచన. శైలి ప్రబంధ కవులది. ద్రాక్షా పాకము. దీర్ఘ సమాసాల కాయన రచన పుట్టినిల్లు. హృద్యము, ప్రసాద ఓజోగుణాలు ఈయన రచనల్లో మెండుగా కన్పిస్తాయి. శయ్యా పాకము, భాష, రుచి, భావస్ఫూర్తి, పదలాలిత్యము, గంభీరత వీరి పద్యాలలో కొట్ట వచ్చినట్లు కన్పిస్తాయి. దీర్ఘ సమాసాలకు, నాతి దీర్ఘము కాని సమాసాలకు, ఉదాత్తత లోపించని పదప్రయోగాలకు వీరి పద్యాల్లో కొదువే ఉండదు. దుష్కర ప్రాసలతో పద్యరచన చేయడ మంటే గుప్తగారికి నల్లేరు మీద బండినడక. అల్పాక్షరాలతో అనల్పార్థ రచన చేయడములో గుప్తగారికి గల శక్తి అద్భుతము. పూర్తి సంస్కృత పదాలూ, పూర్తి తెలుగు పదాలతో కూడా వీరి పద్యాలు కన్పిస్తాయి. ఈ పద్యాలను పరికించండి.

వైశ్యప్రబోధిని, మే, 1994

"శారదైందవ జ్యోత్స్నా హసన సుమంద
హాసరేఖా మిళదనుగ్రహ విలసత్క-
టాక్ష భంగ తరంగ రంగాననకును
కుసుమనామ వైశ్య శ్రేష్ఠ కొమరితకును"
"వందన ముంబొనర్చెద మభంగుర భక్తి
చెలంగు చుండ
సంక్రందన ముఖ్యదైవత శిరస్స్రగిత కోటి
సముల్ల సన్మనీ
బృంద పరిష్కృయాంచిత పవిత్ర చరిత్ర
పదారవింద ని
ష్యందమరంద నందిత నతాశ్రిత పాళికి
నిందు మౌళికిన్"

మొదటి పద్యములో తొలి మూడు పాదాలు ఒకే సమాసము. మలి పద్యములో చివరి మూడు పాదాలు ఒకే సమాసము. పద్యమే కాదు. వచనం కూడ దీర్ఘ సమాసాలతో కూడి ఉండిన సందర్భాలు కూడ ఆయన రచనల్లో తరచుగా కన్పిస్తాయి.

దీర్ఘ సమాసములతోనే కాదు. పొడి పొడి మాటలతో కూడ గుప్తగారు పద్యాన్ని వ్రాయ గలరు అనే దానికి ఈ క్రింది పద్యం ఒక ఉదాహరణ.

"గణపతి పొంగె, షణ్ముఖుడు గౌరవమిచ్చె,
వృషాధిపుండు సో
ల్పణ ముదముంగనెన్, ప్రమదవర్గము
తోషిలె, దీన మోద కా
రణము చెలంగె, మౌని తతిరక్తిగనెన్,
ద్విజపంక్తి సొంపునం
గణక దలిర్చె నల్ల మునిగణ్యుని రాక
శరత్తు రాకగాన్"

ఇందులో నాలుగవ పాదములోని మొదటి "రాక"కు అర్థము వచ్చుట, రెండవ "రాక"కు పౌర్ణమి అని. "రాక" అంటేనే కార్తీక పౌర్ణమి అను అర్థము కూడ వస్తుంది.

విడి విడిపదాలే గాక తెలుగుతనం ఉట్టి పడే పదాలతో సాగింది ఈ పద్యం గమనించండి.

"నెమ్మిని పీడి, నిన్ననిన నీకను దోయికి
మట్టి గొట్టి న్యా
యమ్మును టేగి నా యెడల నాశయ
మూనిన నీమనంబు భ్ర
ష్టమ్మయి పోను, నా యెదుట
జయ్యనకొండొక దున్నపోతు చం
దమ్మున నిల్తువేల? యిక దచ్చనలాడక
వెళ్ళిపొమ్మురా"

ఈ పద్యములో నెమ్మిని పీడి, కనుదోయి, మట్టిగొట్టి, దున్నపోతు, మొదలగునవి తెలుగు పదాలు.

లోకోత్తర వర్ణనానిపుణః కవిః అని కవికి నిర్వచనము. లోకోత్తరంగా వర్ణనలు చేయువాడే కవి అని దీని అర్థము. ఈ నిర్వచనమునకు గుప్తగారు మంచి దృష్టాంతము. వర్ణనలు చేయడములో గుప్తగారు నిష్ణాతులు. లాక్షణికులు. ప్రధానంగా పద్దెనిమిది వర్ణనలను పేర్కొన్నారు అయితే గుప్తగారు పన్రెండింటిని మాత్రమే స్వీకరించి, ఆయా సందర్భాలలో తమ కావ్యాలలో లోకోత్తరంగా వ్రాశారు.

" ఏలాలతా జాల హేలా పరిష్కార
కలితపున్నాగ వృక్షవ్రజంబు
పన్నగా హారదీవ్యచ్చందన సుమర్తు
ల్లి కల సన్మందానిల లలితంబు
వికచారవిందౌఘ మకరంద పాన మ
త్త మిళంద ఝింకార తతి యుతంబు
పుష్పితాశోక సంపుల్ల మల్లీవితా
న వకుళ వంజుల ప్రవిలసితము

మదన సందీపనా మంద మంత్ర తంత్ర
పఠన స్వభ్రాంతికర శుకవ్రాత శారి
కా నికాయ వైభవయుతుడై నెఱిని వ
సంతు డవరించెను బలు సంతసమున"

శివుని తపస్సుకు భంగము కలిగించుటకు మన్మదుడు వెళ్ళుటకు ముందు గల వసంత ఋతు వర్ణనము ఇది.

ఇక గుప్తగారి అలంకార నైపుణిని గురించి చెప్పాల్సివస్తే గుప్తగారు అర్థాలంకారాలూ, శబ్దాలంకారాలూ రెండింటిని కూడ సమర్థవంతంగా పోషించారు. శ్లేషాలంకారాన్నే కాదు. సభంగశ్లేషను కూడ వ్రాశారు. ఒకే పదానికి రెండు మూడు అర్థాలు వచ్చే విధంగా వ్రాస్తే అది శ్లేష అవుతుంది. పదాన్ని విభజించినపుడు ఒక అర్థమూ, విభజించకుండా మొత్తము పదానికి వేరొక అర్థము వచ్చే విధంగా చెప్తే సభంగశ్లేష అవుతుంది. గుప్తగారి శబ్దాలంకార నైపుణికి దృష్టాంతంగా ఈ పద్యాన్ని చెప్పుకోవచ్చు.

"బంగరు టరంగు మీదం దురంగలించు
పలు మెఱుంగుల రంగుల బరగు నిగ ని
గ నిగ దగు రతనాల సింగంపు గద్దె
మీద పరమ సౌందర్యమున మేల్మిదనర.

"పల్లవ తతి యామె పల్లవంబున కోడు
గాహళంబీగు జంఘాద్వయికిని
రహి నూరువులపొంత రంభోరుతయడంగ్గు
కౌ 'నస్తి నాస్తి' వాదాన కిక్కి
ఆకుచద్వయి దింపు గోకద్వయము సొంపు
నరితి శ్రీకి గాంచు దరము దరము
నెరికొప్పు నీరద నీరదత్వము గొల్పు
నిండు జందురు సొంచు నెమ్మొగంబు
మేనిచాయ బంగారంబు మేల్మిదెగడు
అల్లిచాన - నీయాన - నీ క్షర్తమాన
సానగాని - వాక్కునగాని - సరగ నెవ్వ
డీని నల సోయగము సుంత లెన్న లేరు"

పై పద్యములో ప్రభంధ శైలి గుమ్మగా పరిమళిస్తోంది. ఇందులో శ్లేష కూడ చక్కగాపోషించబడింది. ఇందులోని పల్లవము అనే పదానికి చిగురు అనీ, పత్ + లవము అని విభజించుకుంటే కాలి ధూలి అనీ, రంభోరుత అంటే అరటి అనీ, రంభ+ఉరుత అని విభజించుకుంటే రంభ యొక్క గొప్పతనము అనీ, అరితి శ్రీ అంటే గొంతు అని, మెడ అని. ఇలాగే మిగతా పదాలకు కూడ శ్లేష కన్పిస్తోంది. మొదటి పద్యములో 12 'గ'లు ఉన్నవి. గమనించండి. ( ఇంకా ఉంది )

---

చ॥ జయ జయ । ఆర్యవైశ్య కుల-సాగర పూర్ణ శశాంక చంద్రికా ।
జయ జయ । భానుకోటి మణి-జాల సమగ్ర కిరీట భాసితా ।
జయ జయ । నామ సంస్మరణ-సాధు జనావన నిత్యవర్తినీ ।
జయ జయ । మందహాస గుణ-శాంత శుభాకృతి కన్యకాంబికా ।

— కోట సోదర కవులు

# నేను, నా దేశం

( గత సంచిక తరువాయి )

పెండ్లికి వచ్చిన బంధువుల్లో ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క పొయ్యి ముట్టించారు. ఆ కులంలో సహపంక్తి భోజనాల సాంప్రదాయం లేదట. మాకు మాత్రం బ్రాహ్మలచేత వడ్డించారు. వారితో కలసి భోంచేయ్యాలని మేము పట్టు పట్టాము. కాని వధూవరులతోనైనా కలసి భోంచేయడానికి వల్లకాదన్నారు. శ్రీ పెదప్రోలు సూర్యనారాయణగారి అవస్థ నేమని చెప్పను! ఆయనకు భార్యలేదు! విశ్వ బ్రాహ్మణులు భోజనం పెట్టరు; పెట్టినా ఆయన తినకూడదట! మాతోనూ కలసి భోంచెయ్యడు. మిఠాయి కొని తెచ్చుకొని కాలం గడిపారు. కంసాలి పెళ్ళికి ఇంటినిండా పొయ్యిలే నన్న సామెత తెలిసిపోయింది. ఇండియాలో అలాంటి సంఘమున్నదని నా కంతవరకూ తెలియదు. ఆ కులానికి విమోచనం చాలా కష్టమనితోచింది. ఆ తరువాత విశ్వ బ్రాహ్మణులలో చాలా వివాహాలు జరిగాయి. కొన్ని సందర్భాల్లో దెబ్బ లాటలు, కేసులు జరిగినా సంస్కరణో ద్యమము బలపడుతూ వచ్చింది.

## ఓ ట మి

ఒకటి రెండు వివాహాల విషయంలో ఓడిపోయాను. ముఖ్యంగా ఒక కేసును గురించి వ్రాస్తాను. బెజవాడలో శ్రీ ఆర్.యల్. యన్. శాస్త్రిగారుండేవారు. వారు నా స్నేహితులు. వారికీ, వారి భార్యకూ వితంతు వివాహాలపట్ల అభిమాన మేర్పడింది.

వారి ప్రక్క యింట్లో ఒక బాల వితంతువు ఉన్నది. 16 సం॥ల వయస్సు. వివాహం చేయించమని శాస్త్రిగారినీ, వారి భార్యనూ అడిగింది. ఆవిడకు ఒక అన్న గారు, తల్లి దండ్రులు వున్నారు. అన్న తన వివాహానికి తప్పక ఒప్పుకుంటాడని ఆ పిల్లకెంతో నమ్మకం. ఆ వయసులో తల్లిదండ్రుల సమ్మతిలేకుండా పెళ్ళి చేసుకోడానికి చట్టం వొప్పదు. కాబట్టి తన అన్నగారితో మాట్లాడిచూడమని సలహా యిచ్చాము. మరునాడు శాస్త్రి దంపతులు ఏడుస్తూ మా యింటికి వచ్చారు. వారి దుఃఖానికి కారణం యిది; ఆ బాలవితంతువు అన్నగారితో చెప్పగా చెల్లెలిని కోప్పడితిట్టాడట; తల్లిదండ్రు లకు రిపోర్టు చేశాడట; అందరూ కలసి పిల్లను బాగా కొట్టారట; వంటయింట్లో వేసి మూసేశారట; పాపం! ఏడుస్తున్న దట; ఎలా రక్షించడం? ఆమెను కలుసుకోడానికి సాధ్యపడలేదు. సంగతి సందర్భాలు తెలుసుకోటానికైనా వీల్లేకుండా తల్లి తండ్రులు కాపలా కాస్తున్నారు.

ఆపిల్లను రక్షించేందుకు మార్గం తోచక

నా శక్తిహీనతకు విచారపడ్డాను. గుంటూరు వెళ్ళి మిత్రుడు తెలికచర్ల రామమూర్తి గారితో చెప్పాను. ఆయన కాలేజీలో టీచరు. ఇద్దరం కలిసి మా మిత్రుడు శ్రీ కె. కల్యాణస్వామి[సబ్ జడ్జి] గారి వద్దకు వెళ్ళి చట్టంలో ఏమున్నదో చెప్పండని కోరాము. ఆపిల్లను తల్లిదండ్రుల యింటి నుండి లేవదీసు కొచ్చి వివాహం చేయిం చాలి. వయసు చాలనందున, ఆ పిల్ల స్వతంత్రించి చేసుకోకూడదు. కాబట్టి ఆమెకు సహాయం చేసేవారికి కనీసం ఆరు నెలల శిక్షతప్పదు. అయితే కోర్టులో యీ విషయాలను బయటపెట్టి బాగా ప్రచారం చేసుకోవచ్చు. సాహసించండని జడ్జిగారు ప్రోత్సహించారు. నా మిత్రుడు శ్రీ తెలికచర్ల రామమూర్తిగారు జైలుకు సిద్ధపడ్డారు; నాతో బెజవాడకు వచ్చారు. శాస్త్రి దంపతుల సహాయంతో ప్రయత్నిం చాము. రాత్రింబవళ్ళు ఆ యింటి చుట్టూ వీధుల్లో తిరిగాము. మూడు రోజులు ప్రయాసపడినా ఫలితం లేనందున విసు గెత్తి మానేశాము.

ఆ పిల్లకు తల బోడిచేయించారు. పునర్వివాహం కంటె వ్యభిచారమే మేలన్నారు. పాపం! చెడిపోయింది! మూడేళ్ళు గడిచాయి. ఒకనాడు శాస్త్రి గారు నన్ను తమ యింటికి తీసుకెళ్ళి ఆమెను పరిచయం చేశారు. వివాహానికి సహాయం చేస్తానని చెప్పాను. "పెళ్ళి చేసుకోవాలను కున్నందుకే అన్ని కష్టాలు వస్తే, మరి వివాహం చేసుకొన్న తరువాత ఇంకెన్ని కష్టా లుంటాయో!" నాకు పెళ్ళొద్దని, ఖండితంగా చెప్పేసింది. రామమూర్తిగారి త్యాగం, దంపతుల దుఃఖం నాకు జ్ఞప్తికొస్తూండేవి.

ఇదే బ్రాహ్మణ సంఘంలో నేను వితంతూ ద్వాహం చేయించడానికి చేసిన మొదటి ప్రయత్నం. ఇప్పుడు వారిలో ఎన్నెన్నో జరిగిపోతూ వున్నాయి. కాని, ఆ సంఘాన్ని ఒకటిగా చేయడం ఎవరికీ సాధ్యంకాని పనియని తలచాను. ఆ కులంలో ఉద్యమ రూపంగా నే నేమీ చేయలేదు. నా వద్దకు వచ్చిన వితంతువు లకు మాత్రం పెళ్ళిళ్ళు చేయించు చుంటిని. 1930 తరువాత మద్రాసులో మేము స్థాపించిన వితంతు శరణాలయానికి వచ్చి సహాయం పొందిన స్త్రీలలో ఎక్కువ మంది బ్రాహ్మలే.

నేను చేయించిన వివాహాల్లో కొన్ని జయప్రదం కాలేదు; అయితే అవి చాలా తక్కువే ననుకోండి. వాటిని గురించి ఈ ఉద్యమంలో కలిగిన కొన్ని అనుభవాలను గురించి 1932 లో "భారతి"లో రెండు వ్యాసాలు వ్రాసి, ప్రకటించాను.

## ఇంట గెలవాలి

నేను చేస్తున్న సంఘసంస్కరణలు నా జన్మస్థానము కనిగిరిలో మా కుల పెద్దల కెంత మాత్రం యిష్టంలేదు. ముఖ్యంగా నా బావగారు (శ్రీ నీలిశెట్టి గురవయ్యగారు) ఇతర బంధుమిత్రులకు యిష్టంలేదు.

కనిగిరి తాలూకా వైశ్యులు కడుబీదలు. వారు కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలలో నీళ్ళు మోసి, వంటలు చేసి, చిల్లర వ్యాపారాలు చేసి, బట్టల మూటల

వ్యాపారాలవల్ల కొద్దో గొప్పో సంపాదించు కొచ్చి స్వగ్రామాల్లో కుటుంబ పోషణ చేసుకుంటారు. ఏటేటా ఇలాగే కష్టపడు తుంటారు. అట్టివారు తిరిగి కనిగిరి వెళ్ళి నప్పుడు హోటళ్ళలో కూడా భోజనం పెట్టటం మానేశారు. వారు వితంతూ ద్వాహములలో పాల్గొనకపోయినా, వ్యతిరే కంగా పనిచేసినా కూడా ఆ డెల్టా జిల్లాలనుండి వచ్చినంత మాత్రాన కుల బహిష్కారం చేసేవారు. ఇది ఘోరమైన శిక్ష! కొందరు నాతో మొరపెట్టుకున్నారు. నేను కనిగిరికి వెళ్ళి "మీరెంత" అని ధిక్కరించి, సవరించి రావాలి. అందుకోసం పనిపెట్టుకుని వెళ్ళాను.

ఆ వూళ్ళో నా చెల్లెండ్రు ఇద్దరు న్నారు. పెద్దబావగారు ఛాందసులు. చిన్న బావగారు 1920 మొదలు 1930 వరకు నాతో సహపంక్తి భోజనం మానేశారు. చిన్నబావగారి యింటికే వెళ్ళాను. పెద్ద వారు చిన్నవారితో "చంచన్నకు భోజనం పెట్టావా, వెలేస్తారు. ముందుగా పెద్దశెట్టి గారి ఉత్తరువు తీసుకో! జాగ్రత్త!" అని పిరికిమందు పోశారు. పెద్దశెట్టిని అడిగితే తానేమీ చెప్పలేనన్నాడు. నేను ఈ కష్టాలు వస్తాయని గ్రహించే, అపక్వాహారాలు దండిగా తీసుకెళ్ళాను. నా చెల్లెలు ధైర్య శాలి; భోం చేయ్యాలిసిందేనని నిర్బంధం చేసింది. "కులంలో వెలివేస్తే జుల్మానా చెల్లించుకొని మళ్ళీ కులంలో చేరవచ్చు" నని వాదించింది. మా చిన్న బావ అంగీకరించక తప్పలా; నే నెంత చెప్పినా నా చెల్లెలు ఒప్పుకోలేదు. మరి భోంచేశాను.

కుల పెద్దను పిలిపించాను; కాని, ఆయన రాలేదు. భయపడిపోయాడు. కులపెద్దల యిండ్లలో జరిగే గుసగుసలు యువకులు నాతో చెప్పుతూవచ్చారు. యువకులందరూ నా కనుకూలురే. సాయంత్రం ఒక బహిరంగసభ నేర్పాటు చేశారు వైశ్యసంఘ నాయకులు.

అప్పుడుడొక చిన్న అల్లరిచేశాను. ఒక ప్పుడొకచోట వితంతు వివాహం చేసు కొన్నవారిని బహిరంగంగా బహిష్కరించి నందుకు కోర్టులో కేసు నడిచింది. బహిష్కరించిన వారికి కారాగారవాసము. జుల్మానా విధింపబడ్డాయి. ఆ తీర్పును కరపత్రాలుగా అచ్చువేయించి వుంచాను. వాటి నా మీటింగుకు వచ్చే వారికి పంచిపెట్టారు నా శిష్యబృందం. పెద్దలు చదువుకొని భయపడి సభకే రాలేదు. యువకులు మాత్రమే వచ్చారు. వితంతు వివాహాలు చేయించినందుకు నన్ను అభి నందించుతూ తీర్మానించారు. మరునాటి ఉదయం పెద్దశెట్టిగారు నన్ను కలుసు కొని, ఇకమీదట ఎవరినిగాని బహిష్కరించ మని హామీ యిచ్చారు. 24 గంటలలో పని పూర్తయిపోయింది. ఇది 1930లో జరిగింది. ఇప్పుడా తాలూకాలో ఎవరింటిలో వారే వితంతు వివాహాలు చేస్తున్నారు.

## పర్యావలోకనం

మా ఇంట్లో వధువు లెందరో వుంటూండేవారు. నా భార్య అన్నపూర్ణమ్మ వారినెంతో ప్రేమగా చూచుకొనేది. ఇలాంటి సంఘసేవ చెయ్యాలన్న ఆశతోనే ఆమె నన్ను వివాహం

చేసుకొన్నది. సంఘ సంస్కరణోద్యమాలంటే ఆమెకెంతో సంతోషం. వధువులతో ఆమె చాలా చనువుగా వుండేది, వారు వరుసలతో పిలుచుకొనేవారు. ఆ అమ్మాయిలు నాతో కూడ తమ కష్టసుఖాలను చెప్పుకొనేవారు. ఆ పిల్లలను తమాషాగా "ఎందుకమ్మా! మళ్ళీ వివాహం చేసుకోవాలనే పట్టుదల నీకు?" అని అడిగే వాడిని. వారు ఉన్నది ఉన్నట్టుగానే జవాబిచ్చేవారు. వారి వారి కోరికలు విచిత్రంగా వుండేవి. ఒకామె వయస్సు 16 సంఉలు. అమాయకురాలు. ఆమె "అందరికీ ఎందుకో నాకూ అందుకే" నన్నది. ఇంకా "నా తోటివాళ్ళు పూలు, నగలు, బొట్టు పెట్టుకొంటూంటే, నాకు లేకపోయెనే అని విచారంగా ఉన్న" దన్నది. "ఇవన్నీ నువ్వు పెట్టుకోడానికి సంఘం సమ్మతించితే, వివాహం మానేస్తావా?" అన్నాను. నవ్వింది. మరొకావిడ "ఒక బిడ్డను కనాలని, ముద్దాడుతూ పెంచుకోవాలని కోరిక ఉందండీ" అన్నది. ఇలాంటి కోరికలను మన ఛాందసులు గ్రహించలేరు గదా!

వితంతువులు చాలామంది వివాహాలు చేసుకోవడం లేదు, అందుకు ముఖ్యంగా ఒక కారణం తెలిసింది. వివాహాలకు ఆర్థిక పరిస్థితులకు దగ్గర సంబంధం వుంది. వివాహం నిమిత్తం నా దగ్గరకు వచ్చిన వారిలో బాగా భాగ్యవంతులుగాని, నీరు పేదలు గాని లేరనే చెప్పవచ్చు. మధ్య తరగతిలో పుట్టి పెరిగి, పేదవారైన తల్లిదండ్రులు తమ వితంతు బిడ్డలను పోషించ లేక, బిడ్డలచే నౌకరీ చేయించుటకు యిష్టపడని వారే పెండ్లికి సమ్మతించుతూ వచ్చారు. భర్త ఆస్తి సంక్రమించిన వితంతువుకు పునర్వివాహం జరగడం అసంభవంగా వుండేది. పెండ్లి చేసుకుంటే ఆస్తి పోతుందని పెద్దవారి భయం. అలాంటి ఆస్తి ననుభవించేవారు. విధవ కుమార్తెల చేతుల్లో ఏ పురాణాలో, శాస్త్రాలో పెట్టి, పాతివ్రత్యాన్ని గురించి హరికథలు చెప్పించి, కాశీ రామేశ్వర యాత్రలకు పంపి, పునర్వివాహంమీద యిష్టం కలుగకుండా చేస్తారు. చాల బీదవారై కాయకష్టంవల్ల జీవించే తల్లిదండ్రులు తమ వితంతు కుమార్తెలచే పనులు చేయించి వారి సంపాదనతో జీవయాత్ర సాగిస్తూ తమ బ్రతుకుదెరువు పోతుందేమోనని పునర్వివాహాలకు అడ్డుపడుతుంటారు.

సంఘంలో ఆక్షేపణేమీ లేకపోయినా, ఆర్థికంగా ఆటంకాలుండడం వల్లను, ఆ విషయంలో చట్టం అనుకూలంగా లేనందునా చాలమంది వితంతువులు వివాహం చేసుకోవటంలేదు. విద్యావంతులైన వరులు వివాహాల ద్వారా ఆస్తి సంపాదించాలని రెండింటికి ముడిపెట్టటం కూడా నాకు బాగా తెలుసు. కాబట్టి, నా ప్రయత్నం ఎంతఫలించినా, ఈ ఉద్యమం వల్లమేలు పొందినవారు కొద్దిమందే ననక తప్పదు. పారిశ్రామిక నాగరికతతోను, సోషలిజంతోను మన సంఘంలో ఆ మార్పులు రాగలవేగాని, ఇప్పుడుండే జమీందారీ సాంప్రదాయాలు, ఫ్యూడల్ సంఘం ఉన్నంతవరకు ఆటంకాలు ఉంటూనే వుంటాయి. (ఇంకా ఉంది)

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్ని చోట్లా " VASAVI "

టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114,

పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.

## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :- 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వత సభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫొటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చు చున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫొటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫొటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు యాత్రీకులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల</u> : తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

I & II ఫ్లోరు రూము డోనార్సు : 10 రూములకు పరిమితము. ఒక లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు సంవత్సరంలో 30 రోజులు రూము యివ్వబడును. వారి ఫోటో శిలా ఫలక రూములో వేయబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్షరూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును. 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో శిలా ఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. త్వరలో తిరుమలలో ఆఫీసు ఓపెన్ చేస్తాము. అంతవరకు పై అడ్రసుకు పంపకోర్తాము.

4. <u>వాసవీ నిలయం, పెనుగొండ</u> : పరిశీలనలో ఉంది.

5. <u>వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి</u>

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ

పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన పర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వేయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారం పర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వేయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వేయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. వాసవి అష్టోత్తర శతహోమకుండ వార్షిక మహా క్రతువు రాబోవు నవంబరులో పుట్టపర్తిలో పెట్టుటకు ఏర్పాట్లు చేయుచున్నాము.


:- ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :-

**మూర్తి వెంకటేశ్వర్లు, వాసవి సత్రముల కార్యదర్శి కార్యాలయం,**

**మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.**

**అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.**


**N.B :-** పై సత్రముల పేరుతో - D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# వైశ్య ప్రబోధిని - క్యాలెండరు

( 1994 మే 21 నుండి 1994 జూన్ 20 వరకు )

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 22 | 29 | 5 | 12 | 19 |
| సోమవారము | | 23 | 30 | 6 | 13 | 20 |
| మంగళవారము | | 24 | 31 | 7 | 14 | |
| బుధవారము | | 25 | జూన్ 1 | 8 | 15 | |
| గురువారము | | 26 | 2 | 9 | 16 | |
| శుక్రవారము | | 27 | 3 | 10 | 17 | |
| శనివారము | 21 | 28 | 4 | 11 | 18 | |

మే 22 :- బక్రీద్.

మే 23 :- నృసింహ జయంతి.

మే 25 :- రోహిణి కార్తె - బుద్ధ పూర్ణిమ

మే 28 :– వాస్తుకర్తరీ త్యాగం.

మే 31 :– ఆదాయపుపన్ను చట్టములోని 192వ విభాగము క్రింద జీతములో పట్టుకొన్న వివరాలను తెలుపు "అన్యువల్ రిటర్న్" అనగా 24వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

మే 31 :– ఆదాయపుపన్ను చట్టములోని 194 B విభాగము క్రింద లాటరీలు, 'క్రాస్ వర్డ్ ఫజిల్స్' ద్వారా వచ్చు ఆదాయములపై పట్టుకొన్న మొత్తం వివరాలను తెలుపు "అన్యువల్ రిటర్న్" అనగా 26 B ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను శాఖాధికారికి చేర్చుటకు తుది రోజు.

మే 31 :– ఆదాయపుపన్ను చట్టములోని 194 BB విభాగము ప్రకారము గుర్రపు పందెముల ద్వారా వచ్చు ఆదాయముల విషయంగా పట్టుకొన్న మొత్తము వివరాలను తెలుపు 'అన్యువల్ రిటర్న్' అనగా 26 C ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరితేది.

జూన్ 8 :– మృగశిర కార్తె ప్రారంభం.

జూన్ 15 :– చెక్కుల ద్వారా అమ్మకం పన్నును చెల్లించు అసెసీలు ఆ చెక్కుతో బాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

జూన్ 20 :– A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

**22, 29, 5, 12, 19 ఆదివారాలు**

---

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# రామచరిత మానసం

( తులసీ రామాయణము )

తెలుగు సేత : శ్రీ గాథంశెట్టి శ్రీరాములు, యం.ఎ.

( గత సంచిక తరువాయి )

సేనలు ఏదిశన నడిస్తే ఆదిశను మోసే ఏనుగులు దద్దరిల్లిపోతున్నాయి. సముద్రం క్షుభితమై పోతూ వుంది. పర్వతాలు కదిలాడుతున్నాయి. సూర్యుణ్ణి కప్పి వేసేటంత ధూళి పైకి లేచింది. వాయువు స్తంభించి పోయింది. భూమి అదిరి పోయింది. యుద్ధ భేరీలు భయంకరంగా మ్రోగుతున్నాయి. ప్రళయ కాల మేఘాలు గర్జిస్తున్నట్లున్నాయి. వీరులంతా సింహ నాదాలు చేస్తూ వున్నారు.

యోధులారా, మీరంతా వానర భల్లూక సేనలను మట్టు పెట్టండి. నేను రాజ కుమారు లిద్దరినీ చంపివేస్తాను– అంటూ రావణుడు తన సేనలను ముందుకు నడిపించాడు.

ఇటువైపు రామదండు బయలు దేరింది. విశాలమైన వానర భల్లూక సేనలు భయంకరంగా కనిపిస్తున్నాయి. సేనలన్నీ రెక్కలున్న పర్వతాల్లాగా వున్నాయి. గోళ్లు, దంతాలు, కొండలు, పెద్ద పెద్ద చెట్లే వాళ్ల ఆయుధాలు. మదించిన రావణుడికి సింహ స్వప్నంలాగా కదిలింది రామదండు.

విభీషణుడు చూశాడు. రావణుడు రథం మీద వున్నాడు. రాముడు రథం లేకుండా వున్నాడు.

"ప్రభూ, మీకు రథంలేదు. కవచం లేదు. కనీసం పాదుకలు కూడా లేవుకదా! అంత బలవంతుడైన రావణుణ్ణి ఎలా జయిస్తారు?" అని విభీషణుడు రాముణ్ణి అడిగాడు.

అప్పుడు దయామయుడైన రాముడు "విభీషణా, జయం కలిగే రథం వేరే వుందయ్యా! శౌర్యము, ధైర్యమే ఆ రథానికి చక్రాలు, బలపరాక్రమాలు, ఇంద్రియ దమనం, పరోపకారం–ఈ నాలుగు ఆ రథానికి గుర్రాలు. క్షమ, దయ, సమత అనే పగ్గాలతో అవి కట్టబడి వున్నాయి, ఈశ్వర భజనయే చతురుడైన సారధి. వైరాగ్యమే డాలు, సంతోషమే ఖడ్గము, దానమే గొడ్డలి, బుద్ధియే శక్తి, శ్రేష్ఠవిజ్ఞానమే కఠోరధనుస్సు. నిర్మలమూ స్థిరత్వమూ కలిగిన మనస్సే అంబులపొది. శమ, యమ, నియమాలే బాణాలు. బ్రాహ్మణ పూజ, గురుపూజయే అభేద్యమైన కవచం, విజయానికి ఇంతకుమించి ఉపాయమే లేదు. ఇటువంటి ధర్మమయమైన రథం వున్న వీరుడు ఎంతదుర్జయుడైన శత్రువునైనా జయించ గలుగుతాడు." అన్నాడు.

ఈ మాటలు విన్న విభీషణుడు ఆనందంతో రాముని పాదాలకు నమస్కరించాడు.

అటు వైపు రావణుడు సవాల్ చేస్తూ వున్నాడు. ఇటు వైపు అంగదుడు, హనుమంతుడు సవాల్ చేస్తూ వున్నారు. ఉభయ సైన్యాలు తలపడ్డాయి.

ఘోర సంగ్రామం జరిగింది. రాక్షస సేనలు క్రమంగా నేల కూలుతూ వున్నాయి. తెగిన తలలు 'జై జై' అంటున్నాయి. మొండాలు పరుగెత్తుతున్నాయి. పక్షులు తన పుర్రెలు పొడుచుకుంటూ వాదులాడుకుంటున్నాయి. రామచంద్రుని ప్రతాపంతో వానరులు రాక్షస సేనలను నలిపి పారేస్తునారు. శ్రీరాముని బాణాల తాకిడికి రాక్షస యోధులు నేల కూలి పోయారు.

చూశాడు రావణుడు. రాక్షసులంతా నాశనమయ్యారు. తాను ఒక్కడే అయ్యాడు. వానర భల్లూకాలు దండిగా వున్నాయి. కనుక ఏదైనా మాయ చేయాలను కున్నాడు.

రాముడు రథం లేకుండా యుద్ధం చేయడం దేవతలు చూశారు. వాళ్ల మనస్సుకు బాధ కలిగింది. వెంటనే ఇంద్రుడు తన రథం పంపాడు. ఇంద్రుని సారధి మాతలి సంతోషంగా రథం తీసుకొచ్చాడు. ఆ దివ్య రథం మీద రామచంద్రుడు ఎక్కాడు. ఆ రథానికి మనో వేగంతో పరుగెత్తే గుర్రాలున్నాయి.

రావణుడు మాయ వ్యాపింప చేశాడు. రాముడు తప్ప మిగతా వారంతా మాయకు లోనయ్యారు. వానరులకు రాక్షస సేనలు, అందులో అనేక మంది రామలక్ష్మణులు కనిపించారు. వానరులంతా భయపడి పోయారు. ఏమీ తోచని పరిస్థితి ఏర్పడింది. ఈ మాయను తెలుసుకొన్న రాముడు ఒక్క బాణంతో మాయనంతా తొలగించి వేశాడు. వానరులంతా సంతోషించారు.

వానరులంతా యుద్ధంలో అలసి పోయినట్లు తెలుసుకొన్న రాముడు తాను స్వయంగా యుద్ధానికి దిగాడు. బ్రాహ్మణులకు నమస్కారం చేసి రథం నడిపించాడు.

రావణుడి కోపం పెరిగి పోయింది. సవాల్ చేస్తూ, రంకెలు వేస్తూ ముందుకు వస్తున్నాడు. రాముణ్ణి చూశాడు.

"తపస్వీ, యుద్ధంలో నువ్వు ఇంత వరకు జయించినటువంటి వీరుణ్ణి కాదు నేను. నాపేరు రావణుడు. నా కీర్తిని లోకమంతా ఎరుగును. దిక్పాలకులంతా నా కైదులో పడి వున్నారు. నువ్వు ఖర దూషణులను, విరాధుని సంహరించావు. వాలిని చంపావు. ఎందరో రాక్షస యోధులను తుదముట్టించావు. కుంభకర్ణ, మేఘనాధులను పరలోక గతులను చేశావు. కాని ఇవ్వాళ నువ్వు రణరంగం నుంచి పారిపోకుండా వుంటే, నా పగ అంతా తీర్చుకుంటాను. ఇవ్వాళ నిన్ను నేను నిశ్చయంగా మృత్యు దేవతకు అప్పగిస్తాను. ఈ రోజుకు నువ్వు నా పాలిట పడ్డావు!" అన్నాడు. కోపంతో అతడి పౌరుషం పెల్లుబుకింది. వజ్రాయుధం వంటి బాణాలు వొదుల్తున్నాడు. రకరకాలైన ఆకారాలు గల బాణాలు వొదుల్తున్నాడు. బాణాలు అన్ని దిశల్లోనూ భూమ్యాకాశాలను వ్యాపించాయి.

శ్రీరాముడు అగ్ని బాణం వొదిలాడు. రావణుడి బాణాలన్నీ క్షణ కాలంలో భస్మమైపోయాయి. రావణుడు తీక్షణమైన శక్తిబాణం వొదిలాడు. శ్రీరాముడు తన బాణంతో దాన్ని వెనక్కు పంపించేశాడు.

రావణుడు లెక్కలేనన్ని చక్రాలు, త్రిశూలాలు విసుర్తున్నాడు. రాముడు వాటిని సునాయాసంగా విరగ్గొట్టి పారే

స్తున్నాడు. రావణుడు రాముని రథసారథిని వంద బాణాలతో కొట్టాడు. సారథి భూమ్మీద పడిపోయాడు. దయామయుడైన రాముడు తన సారథిని లేవదీశాడు. వెంటనే రాముడు అమితమైన కోపంతో ధనుస్సును ఆకర్ణాంతం లాగి భయంకరమైన బాణాలు వొదిలాడు. ఆ బాణాలు బుసులు కొట్టే పాముల్లాగా ముందుకు దూసుకపోయాయి. ముందు రావణాసురుని సారథిని, గుర్రాలను చంపి వేశాయి. ఆనక రథాన్ని ముక్కలు ముక్కలు చేసి ధ్వజాన్ని పడగొట్టాయి. ఇదంతా చూసిన రావణుడు భీకర గర్జన చేశాడు. కాని, బలం సన్న గిల్లి పోయింది.

వెంటనే రావణుడు మరో రథం పైన ఎక్కి అనేక అస్త్ర శస్త్రాలు వొదిలి పెట్టాడు. కాని అన్నీ నిష్ఫలమయిపోయాయి. అప్పుడు పది త్రిశూలాలు వొదిలాడు, అవి రాముని నాలుగు గుర్రాలను కొట్టి పడవేశాయి. రాముడు వెంటనే ఆ నాలుగు గుర్రాలను లేవనెత్తి ధనుస్సు ఎక్కుపెట్టి రావణుడి పదితలల పైన పది తీక్ష్ణమైన బాణాలు వొదిలాడు. అవి రావణుడి తలల్లోనుండి దూసుకపోయాయి. ఆ తలల్లో నుండి రక్తం కాలువగా పారింది. రక్తం కారటంతో రావణుడు అటూ ఇటూ పరుగెత్తడం మొదలెట్టాడు. అప్పుడు రాముడు ముప్పయి బాణాలు వొదిలాడు. అవి దూసుకపోయి ఇరవై భుజాలతో బాటు పది తలలు తుంచివేశాయి.

ఈ విధంగా భుజాలు, తలలు తెగి భూమ్మీద పడగానే మళ్లీ కొత్తగా తలలు, భుజాలు పుట్టుకొచ్చాయి. మళ్లీ మళ్లీ రాముడు రావణుని తలలు, భుజాలు విరగ్గొట్టడం, మళ్లీ మళ్లీ కొత్తవి పుట్టుక రావడం – ఇలా జరుగుతూనే వుంది.

రావణుడికి బాగా కోపం వచ్చింది. పది ధనుస్సులను ఎక్కు పెట్టి బాణవర్షం కురిపించి శ్రీరాముని రథాన్ని కప్పి వేశాడు. సూర్యుణ్ని మేఘాలు కప్పి వేసినట్లు ఒక్క క్షణ కాలం రాముని రథం కనుపించనే లేదు.

దేవతలు హాహాకారాలు చేశారు. రాముడికి కోపం వచ్చింది. వెంటనే ఆ బాణాలన్నిటినీ చెల్లా చెదరు చేసి రావణుడి తలలు ఎగర గొట్టడం మొదలెట్టాడు. ఆ తెగిన తలలన్నీ దశ దిశలూ నిండి పోయాయి.

రావణుడు మళ్లీ కోపంతో ప్రచండ శక్తిని వొదిలాడు. అదివిభీషణుని వెంట పడింది. తటాల్న రాముడు విభీషణుణ్ణి తన వెనుకకు తీసుకొని ఆ శక్తిని తాను హరించాడు.

శక్తిని హరించడంతో రాముడికి కొన్ని క్షణాలు మూర్ఛ వచ్చినట్లయింది. ఇదంతా దేవుని లీల మాత్రమే. అయినా దేవతలంతా దిగులు చెందారు. విభీషణుడు కోపంతో గద ఎత్తుకొని వెళ్లి రావణుడి గుండెల మీద కొట్టాడు. ఆ దెబ్బతో రావణుడు భూమ్మీద పడిపోయాడు. పది నోళ్లనుంచీ రక్తం కక్కాడు. కొద్ది సేపట్లో మళ్లీ లేచి విభీషణుడితో తలపడ్డాడు. భయంకరమైన మల్ల యుద్ధం జరుగుతూ వుంది.

విభీషణుడు కొంచెం అలసిపోయినట్లు కనపడగానే హనుమంతుడు ఒక కొండను పెళ్ళగించు కెళ్లి రావణుడి రథాన్ని, గుర్రాలను, సారథిని కొట్టాడు.

వాడి గుండెల మీద ఒక్క తన్ను తన్నాడు.

విభీషణుడు శ్రీ రాముని వద్ద కెళ్లి పోయాడు. రావణుడు హూంకరించి హనుమంతుణ్ణి కొట్టాడు. హనుమంతుడు తోక ఝాడించి ఆకాశం లోకి ఎగిరి పోయాడు. రావణుడు అతడి తోక పట్టుకొని ఆకాశంలోకి వెళ్లాడు. మళ్లీ ఇద్దరూ భూమ్మీదకు వచ్చి ఒకరి నొకరు కొట్టుకోవడం మొదలెట్టారు. ఇంతలో వానర వీరులంతా వచ్చి రావణుడి మీద పడ్డారు. ఆ దెబ్బకు రావణుడు తట్టుకోలేక మాయ చేశాడు.

రావణుడు మాయతో క్షణకాలం అదృశ్యమయ్యాడు. మరుక్షణంలో అనేక రూపాలు దాల్చి ఎక్కడ చూసినా రావణుడే కనిపించాడు. వానరులంతా అయో మయంలో పడిపోయారు.

అప్పుడు రాముడు సారంగ ధనుస్సు ఎక్కు పెట్టి ఒక్క బాణంతో మాయ నంతా తొలగించి వేశాడు. దేవతలు, వానరులు సంతోషించారు.

అప్పుడు రాముని ఆసరాతో వానరు లంతా, బలాన్ని పుంజుకొని మళ్లీ పరుగెత్తు కుంటూ యుద్ధ క్షేత్రంలోకి వచ్చేశారు.

దేవతలంతా రాముణ్ణి స్తుతించడం రావణుడు చూశాడు. తనను ఒంటరి వాడుగా భావించారను కొని, ఓరేయ్, మీరంతా ఎప్పుడూ నా చేత దెబ్బ తినే వాళ్లే,– అంటూ వాళ్ల మీదకు ఆకాశంలోకి పరుగు తీశాడు. దేవతలంతా హాహా కారాలు చేస్తూ పరుగెత్తారు.

ఈ విధంగా దేవతలంతా భయపడి పోవడం చూసి అంగదుడు ఆకాశంలోకి ఎగిరిపోయి రావణుడి కాళ్లు పట్టుకొని భూమ్మీదకు లాక్కొచ్చి క్రింద పడేశాడు. కాలితో ఒక్క తన్ను తన్ని తాను రాముడి వద్దకు వెళ్లిపోయాడు.

కాసేపటికి రావణుడు తేరుకొని భయంకరంగా అరవడం మొదలెట్టాడు. పది ధనుస్సులు ఎక్కు పెట్టి బాణ వర్షం కురిపించాడు. యుద్ధ వీరులందరూ దెబ్బలు తిని కలత చెందిపోయారు. రావణుడు తన ప్రతాపానికి మురిసి పోయాడు.

అప్పుడు రాముడు రావణుని తలలు, భుజాలు, ధనుస్సులు విరగ్గొట్టి పారేశాడు. కాని అవన్నీ మళ్లీ పుట్టుకొస్తున్నాయి. ఈ పరిస్థితి చూడగానే వానర భల్లూ కాలకు రావణుడి పైన చెప్పలేనంత కోపం వచ్చింది. వాళ్లందరూ చెట్లు, కొండలు పెళ్లగించు కొచ్చి రావణుడిపైన విసిరేశారు. రావణుడు వాటి నన్నిటినీ పట్టుకొని మళ్లీ వాళ్ల మీదకు విసరడం మొదలెట్టాడు.

కొంత మంది వానరులు వచ్చి రావణాసురుడి శరీరాన్ని తమ గోళ్లతో చీల్చి పరుగెత్తి పోతున్నారు. కొంత మంది తన్నిపోతున్నారు. నలుడు, నీలుడు రావణుడి నెత్తిన ఎక్కి గోళ్లతో అతడి ముఖం గీరడం మొదలెట్టారు. రక్తం కారడంతో రావణుడికి కోపం వచ్చింది. చేతులెత్తి వాళ్లను పట్టుకో బోయాడు. కాని పట్టు దొరకడంలేదు. చేతుల పైన్నే తిరుగు తున్నారు. కాని చేతుల్లోకి రావడం లేదు. అందు కని ఒక్క ఎగురు ఎగిరి వాళ్లను పట్టుకొని నేల కేసి కొట్ట బోయే లోపల వాళ్లిద్దరూ రావణుడి భుజాలు మెలి పెట్టి తప్పించుక పోయారు.

( ఇంకా ఉంది )

# మానవుడు - గ్రహ స్వరూప సాపత్యములు

రచన : శ్రీ నల్లపాల వేణుగోపాల్, బి.ఎ., ధర్మవరము.

సృష్టి ఆదినుండి గ్రహములకు, మానవునకు విడరాని, విడదీయలేని, సంబంధం ఉంది. ఆత్మ, పరమాత్మల కలయిక ఎట్లో మానవ మనుగడకు ఈ గ్రహములు.

రాతి యుగము నుండి నేటి ఈ నవీన యుగము దాక ప్రకృతి, పురుషులు ఈ గ్రహములకు లోబడియే మసలుచున్నారనుట అక్షర సత్యము.

"చాతుర్లక్షంతు జ్యోతిష్యం" అనగా జ్యోతిష్య శాస్త్రమంతయు నాలుగు లక్షల శ్లోకములకు అలరారినది. జ్యోతిష్య శాస్త్రమునకు మూలాధారము నవగ్రహముల చలనములు. నవగ్రహ చలనాన్ని పూర్వీకులు, అమోఘ గణిత శాస్త్రముచే వాటి చలనాన్ని, గమనించి మానవుని కర్మ ఫలాన్ని జగత్తునకు అందింప చేశారు. మహాజ్ఞాని, కాలపురుషుని చలనాన్ని గమనించి, భవిష్యత్తుని బహు చక్కగా చెప్పే జ్యోతిశాస్త్రవేత్త వరాహమిహిరుడు. ఈ మహానుభావుడు ఆరవ శతాబ్దికి చెందినవాడు. శ్రీ విక్రమార్కుని ఆస్థాన జ్యోతిష్యుడు. తొలుత, మిహిరుడనియే పిలిచెడివారు. విక్రమార్కుని కుమారుని జాతకమును గమనించి బాలుడు వరాహముచే చిక్కి మృతుడగునని, అది సంభవమని, రాజునకు ధైర్యముగా నిజమును నిర్భయంగా వక్కాణించి వాక్శుద్ధిని కాపాడుకొన్న మహనీయుడు. ఆచార్యుడు వచించినట్లే బాలకుడు వరాహ చిహ్న టెక్కెముమీద పడి అశువులను బాసెను. రాజు నాటి నుండి మిహిరునకు "వరాహ" అను బిరుదమును వొసంగి ఆచార్యుని "వరాహ మిహిరుడని" గౌరవించెను. కాననే జ్యోతిషమునకు వాక్ శుద్ధి ప్రధానము.

గ్రహ సాపత్యములను విచారించుటకు ముందు నవగ్రహ రూపముల కనుగొనుట చాలా ముఖ్యము. మానవులలో ఉత్తములు, మధ్యములు, అధములు, వున్నట్లు నవగ్రహములలో కూడ, ఉత్తమ, మధ్యమ, అధమ ఫలితములనిచ్చు గ్రహములు ఉన్నాయి.

మానవునకు శత్రువులు, మిత్రులు వున్నట్లే గ్రహములు సహా ఒకప్పుడు మిత్రుత్వమును, మరియొకపుడు శత్రుత్వమును జాతకునిపై ప్రసరింపచేయుచుండును. నవగ్రహములు ద్వాదశ రాశులపై సంచరించునపుడు వారి స్థానములను గమనించుట చాలా ముఖ్యము.

| | | స్వస్థానము | నీచస్థానము | ఉచ్చస్థానము |
|---|---|---|---|---|
| 1. | రవి | సింహరాశి | తులరాశి | మేషరాశి |
| 2. | చంద్రుడు | కర్కాటకము | వృశ్చికము | వృషభము |
| 3. | కుజుడు | మేష, వృశ్చికములు | కర్కాటకము | మకరము |
| 4. | రాహువు | కన్య, వృషభ, మిధునములు | మీనము | కన్య |
| 5. | గురువు | ధనుర్, మీనములు | మకరము | కర్కాటకము |

| | | | | |
|---|---|---|---|---|
| 6. | శని | మకర, కుంభములు | మేషము | తుల |
| 7. | బుధుడు | మిథునము | మీనము | కన్య |
| 8. | కేతువు | వృశ్చిక, ధనస్సులు | కన్య | మీనము |
| 9. | శుక్రుడు | వృషభ, తులలు | కన్య | మీనము |

## నైసర్గిక గ్రహ శత్రు మిత్ర సమత్వ చక్రము

| గ్రహములు | మిత్రుడు | శత్రువులు | సములు |
|---|---|---|---|
| 1. రవి | కుజ, గురు, చంద్ర | శుక్ర, శని | బుధ |
| 2. చంద్రుడు | రవి, బుధ | - | కుజ, గురు, శని, శుక్ర |
| 3. కుజ | రవి, గురు, చంద్ర | బుధుడు | శని, శుక్ర |
| 4. బుధ | రవి, శుక్రుడు | చంద్రుడు | కుజ, గురు, శని |
| 5. గురువు | రవి, చంద్ర, కుజ | బుధ, శుక్ర | శని |
| 6. శుక్రుడు | బుధ, శని | రవి, చంద్ర | కుజ, గురు |
| 7. శని | బుధ, శుక్రుడు | రవి, చంద్ర, కుజ | గురువు |
| 8. రాహువు | శుక్ర, శని | రవి, చంద్ర, కుజ | - |
| 9. కేతువు | రవి, చంద్ర, గురు | శుక్ర, శని | - |

ద్వాదశ రాశులకు గ్రహకారకులను గమనించు పట్టిక :

| | | |
|---|---|---|
| 1. | తను స్థానము | - రవి |
| 2. | ధన స్థానము | - గురువు |
| 3. | భాతృ స్థానము | - కుజుడు |
| 4. | మాతృ స్థానము | - చంద్రుడు, బుధుడు |
| 5. | పుత్ర స్థానము | - గురువు |
| 6. | శతృ స్థానము | - శని, కుజుడు |
| 7. | కళత్ర స్థానము | - శుక్రుడు |
| 8. | ఆయుఃస్థానము | - శని |
| 9. | భాగ్య స్థానము | - రవి, గురువు |
| 10. | రాజ్య స్థానము | - రవి, బుధ, గురువు, శని |
| 11. | లాభ స్థానము | - గురువు |
| 12. | వ్యయ స్థానము | - శని |

పై పట్టికను గమనించగా రవి 1, 9, 10 స్థానములకును, చంద్రుడు మాతృ స్థానమునకును, కుజుడు 3, 6 స్థానములకును, గురువు 2, 5, 9, 11, 12 స్థానములకును, శని 6,8,12,10 స్థానములకును, బుధుడు 4, 10 స్థానములకును, శుక్రుడు 7వ స్థానమునకు కారకులని అవగతమగుచున్నది.

మానవ కుటుంబములలో కూడ కొన్ని కుటుంబములయందు యజమానికి, సర్వ అధికారములు స్వాభావికముగా సంక్రమించినప్పటికి, అధికారములను చలాయించక జడుని వలె వుండును. అట్లే, పై ద్వాదశ స్థానములకు కారకులయిన ఈ క్రింది గ్రహములు జాతకునకు ఆ భావములందు

వున్నప్పటికి, శుభత్వమును ఇవ్వక కొన్ని సందర్భములందు ఆ భావములకు హాని సహా చేయును. అవి ఏవనగా శుక్రుడు సప్తమమున, బుధుడు మాతృస్థానమందు, గురువు పంచమ స్థానమందు వున్న సందర్భములందు జరుగుటను గమనించు చుందుము. నైసర్గికంగా గ్రహములకు మిత్ర గ్రహములు, శత్రు గ్రహములు సమగ్రహములు పట్టికయందు గ్రహించినాము. మానవునకు నైసర్గికంగా భార్య తరపువారు, ఆత్మీయతను, క్షేమమును కోరు సహోదరులు, మాతృవర్గీయులు అనగా మేనమామ సంబంధీకులు, చదువు చెప్పిన గురువు ఎట్లు క్షేమంకర పూజ్య, మిత్ర భావము కలవారో అట్లే పై గ్రహములకు మిత్ర, శత్రు, సమగ్రహాలు కలరు. మానవులకు తాత్కాలిక మిత్రులు అనగా ప్రయాణమునందు కలసినవారు, కూడ పాఠకులు, సహోద్యోగులు, సహ క్రీడాకారులు మొదలగువారు. గ్రహములకు అట్లే తాత్కాలిక మిత్ర గ్రహములు, తాత్కాలిక శత్రు గ్రహములు సహ వున్నవి. అవి ఏవనగా గ్రహమునకు 2, 12, 10, 11, 4, 3 స్థానములయందున్న గ్రహములు తాత్కాలిక మిత్ర గ్రహములు. గ్రహమునకు 1, 5, 6, 7, 8, 9 స్థానముల యందున్నవి తాత్కాలిక శత్రుగ్రహములు.

రాశులయందు గ్రహములకు నైసర్గిక మిత్ర, తాత్కాలిక మిత్ర గ్రహములు కలిసిన ఆ గ్రహము అధి మిత్ర గ్రహమై అధిక శుభత్వమును ఆపాదించును. మరి కొన్ని సందర్భములయందు గ్రహములకు నైసర్గిక శత్రుత్వము తాత్కాలిక శత్రుత్వము కలిసిన గ్రహమున్న అది అధిశత్రుత్వమై బహుపాపత్వమును సిద్ధింప చేయును. సాధారణముగా మిత్రుని మిత్రుడు, మనకు మిత్రుడే కదా; శత్రువు శత్రువు మనకు శత్రువే కదా. ఇది స్వత సిద్ధము. గ్రహములునూ అట్టి శుభత్వ, అశుభత్వములు కలిగి జాతకునకు మంచి, చెడులను కలిగించుచుండును.

శుభ గ్రహ పాప గ్రహములు వివరము లను "మానవ జననము-బాలారిష్ట, చంద్రారిష్ట దోషములు" అను వ్యాసమున వివరించియున్నాను. కాన గ్రహింపగలరు.

గ్రహముల అవస్థలు పది రకములు. సదరు అవస్థలయందు గ్రహములు జాతకమున వున్నప్పుడు జాతకుని దశ, అంతర్దశ సమయములయందు శుభ, అశుభత్వములను ఆపాదింపజేయు చుండును.

1. ఉచ్చ స్థానమున వున్న గ్రహము - దీప్తి అవస్థ అందురు. జాతకుని తేజోవంతుని చేయును.

2. స్వస్థానమున వున్న గ్రహము - స్వస్థావస్థ అందురు. జాతకునికి స్వస్థత చేకూర్చును.

3. మిత్ర క్షేత్రమున వున్న గ్రహము - ముదిత అవస్థ అని అందురు. జాతకునికి క్షేమమును కలుగ జేయును.

4. సౌమ్య గ్రహస్థానముల యందున్న గ్రహము - శాంత అవస్థ అందురు. జాతకునికి శాంతమును చేకూర్చును.

5. అస్తంగత దోషములు లేకున్న గ్రహము - శక్త్యావస్థ అందురు. జాతకునకు శక్తిని చేకూర్చును.

6. శత్రు క్షేత్రమున వున్న గ్రహము - దీనావస్థ అని అందురు. జాతకునకు దీనత్వమును చేకూర్చును.

7. నీచ క్షేత్రమున వున్న గ్రహము - భీతావస్థ అని అందురు. జాతకునకు భయమును చేకూర్చును.

8. శత్రుగ్రహ అంశను పొందిన గ్రహము - అతిదీనావస్థ దశ అని అందురు. జాతకుని అతి దీనుని గావించును.

9. అస్తంగత దోషము వున్న గ్రహము -.వికలావస్థ దశ అని అందురు. జాతకునివికలుని చేయును.

10. అన్యగ్రహముచే పీడింపబడిన గ్రహము - పీడితావస్థ దశ అని అందురు. జాతకుని పీడింపజేయును.

గ్రహములు ఆయా రాశులయందు పై కనపరచిన స్థానయులయందున్న సదరు అవస్థలను తప్పక జాతకుడు అనుభవించునని శాస్త్ర సమ్మతము.

గ్రహములు అన్వయ పట్టిక :-

| గ్రహము | లింగము | రంగు | అధిదేవతలు | నవరత్నములు | జాతులు |
|---|---|---|---|---|---|
| 1. రవి | పురుషుడు | ఎరుపు, నలుపు మిశ్రమము | అగ్ని | మాణిక్యము | క్షత్రియుడు |
| 2. చంద్రుడు | స్త్రీ | తెల్లని రంగు | జలదేవత | ముత్యము | వైశ్యుడు |
| 3. కుజుడు | పురుషుడు | ఎరుపు, తెలుపు మిశ్రమము | కుమారస్వామి | పగడము | క్షత్రియుడు |
| 4. బుధుడు | నపుంసకుడు | ఆకుపచ్చ వన్నె | విష్ణువు | పచ్చ | వైశ్యుడు |
| 5. శుక్రుడు | స్త్రీ | పచ్చటిఛాయ | ఇంద్రాణి | వజ్రము | బ్రాహ్మణుడు |
| 6. గురువు | పురుషుడు | బంగారు రంగు | ఇంద్రుడు | పుష్యరాగము | బ్రాహ్మణుడు |
| 7. శని | నపుంసకుడు | నల్లనిరంగు | యముడు | నీలము | శూద్రుడు |

తొమ్మిది గ్రహములు సప్తమ దృష్టి కలవి. కాని విశేషంగా గురువు 5, 9 దృష్టి యును, కుజుడు 4, 8 దృష్టియును, శని 3, 10 దృష్టియును కలిగి యుందురు. పై విశేష దృష్టి కల సమయములందు విశేష బలమును గలిగి వుందురు.

రవి, చంద్ర, గురులు సత్వ గుణము కలవారు. బుధ, శుక్రులు రజోగుణము కలవారు. కుజ, శనులు తమోగుణము కలవారని శాస్త్రము. జాతకునకు గ్రహ ప్రభావములు రవి ఆరుమాసములకు, చంద్రుడు క్షణ కాలమునకు, కుజుడు ఒక దినమునకు, బుధుడు రెండు మాసము లకు, గురువు ఒక మాసమునకు, శుక్రుడు పక్షము దినములకు, శని ఒక సంవత్సర మునకు, గ్రహ ప్రవేశమైన తరువాత ఫలిత ములను ఇచ్చును. కాన, ముఖ్యముగా గమనించవలసినది ఏమన గ్రహ ప్రవేశమైన వెంటనే ఫలితము జరుగుననుట పొర పాటు. పై కనపరచిన కాలము జరిగిన తరువాతనే ఫలితములు జరుగ గలవు.

గ్రహములు ప్రతి రాశి యందు సంచ రించుకాలము ఈ క్రింది విధముగా వుండ గలదు. రవి, బుధ, శుక్రులు ఒక్కొక్క మాసము, కుజుడు ఒక నెల పక్షము రోజులు, గురువు ఒక సంవత్సరము, శని రెండు సంవత్సరములు ఆరు నెలలు, రాహు కేతువులు ఒక సంవత్సరము

ఆరు మాసములు, చంద్రుడు ప్రతి రాశియందు రెండు రోజులు ముప్పై ఘడియలు సంచరించును.

27 నక్షత్రములకు, గ్రహములకు చక్కటి అవినాభావ సంబంధమున్నది. జన్మ నక్షత్రమును బట్టి జనన కాల గ్రహ దశను ఈ క్రింది పట్టికను గమనించిన విషయములు తెలియనగును.

| జనన నక్షత్రము | | | గ్రహ దశలు | సంవత్సరములు |
|---|---|---|---|---|
| కృత్తిక | ఉత్తర | ఉత్తరాషాఢ | రవి మహాదశ | 6 |
| రోహిణి | హస్త | శ్రవణం | చంద్ర మహాదశ | 10 |
| మృగశిర | చిత్త | ధనిష్ట | కుజ మహాదశ | 7 |
| ఆర్ద్ర | | శతభిషం | రాహు మహాదశ | 18 |
| పునర్వసు | విశాఖ | పూర్వాభాద్ర | గురు మహాదశ | 16 |
| పుష్యమి | అనూరాధ | ఉత్తరాభాద్ర | శని మహాదశ | 19 |
| ఆశ్లేష | | రేవతి | బుధ మహాదశ | 17 |
| మఖ | మూల | అశ్విని | కేతు మహాదశ | 7 |
| పుబ్బ | పూర్వాషాఢ | భరణి | శుక్ర మహాదశ | 20 |
| | | మానవుని పూర్ణ ఆయుర్దాయము | | 120 సంవత్సరములు |

దశా ప్రమాణములను 3చే భాగించగా 3 భాగములు ఏర్పడును. మొదటి భాగమును పూర్వ ఖండమనియు, రెండవ భాగమును మధ్యమ ఖండమనియు, మూడవ భాగమును ఉత్తర ఖండమనియు పిలుతురు.

రవి, కుజులు పూర్వ ఖండము నందును, శుక్రుడు మధ్యమ ఖండము నందును, గురు, శని, రాహువులు ఉత్తర ఖండమునందును, బుధ, చంద్ర, కేతువులు ఎల్లప్పుడు యోగము చేయుదురు.

ఈ విధముగా "భ" చక్రముపై గ్రహములు ద్వాదశ రాశులయందు సంచరించు సమయమున ముఖ్యముగా గ్రహ అవస్థలను, గ్రహ దృక్కులను, మిత్రత్వ, శత్రుత్వ, సమత్వ, విషయములను, వాటి రంగు, జాతి, కారకత్వములను, దశార్దవసమయములను, చక్కగ గ్రహించి, అవగాహన యొనర్చుకొని ఫలితములను నిర్దేశించిన, సరస్వతీమాత వాక్‌శుద్ధి చేతను, గురుమంత్ర మూలకారకుడు, గణేశ్వరుని బుద్ధిప్రభావము వల్లను, పూజ్యులను, గురుతుల్యులను, మహిమాన్విత సిద్ధి, బుద్ధి ప్రదాయకులైన మహాఋషుల ఆశీర్వాద ప్రభావము వల్లను ఫలాపేక్షలేని మానవుని అకుంఠిత దీక్ష వల్లను, భగవత్ ప్రసాదిత పుణ్య ప్రభావము వల్లను, సరియైన ఫలితములు లభించగలవని, అవి మానవాళికి, ఉపయోగకరమై, సదా, యోగ్యదాయకమై భవిష్యత్తుకు రాచబాట కాగలవని జ్యోతిష్య శాస్త్ర వేత్తల మనోభిప్రాయము.

మహిమాన్విత గుణ సంపన్నులారా! విషయములను సద్బుద్ధితో విశ్లేషించి, సదా, పరంధాముని కృపకు పాత్రులు కావాలని దేవదేవుని ప్రార్థిస్తాము.



డా. జి.వెంకట ప్రసాద్

# 'ఆయుర్వేద మార్తాండ' డాక్టర్ గ్రంధే రఘురామగుప్తగారి "క్యాంపు" వివరాలు



డా.గ్రంధే రఘురామ గుప్త

| | | | |
|---|---|---|---|
| కడప | 22.5.94 | ఆదివారం | గోకుల్ లాడ్జి |
| తిరుపతి | 23.5.94 | సోమవారం | హోటల్ గౌతమ్, బస్టాండు వద్ద |
| ఒంగోలు | 24.5.94 | మంగళవారం | హోటల్ అభిలాష్ |
| విజయవాడ | 25.5.94 | బుధవారం | హోటల్ అభిలాష్, గవర్నర్ పేట |
| రాజమండ్రి | 26.5.94 | గురువారం | హోటల్ చంద్రలోక్, సాయిక్రిష్ణ థియేటర్ రోడ్ |
| విశాఖ పట్టణం | 27.5.94 | శుక్రవారం | హోటల్ మేఘాలయ, R.T.C. బస్టాండు వద్ద |
| విజయనగరం | 28.5.94 | శనివారం | పూర్ణిమా రెస్టారెంట్ అండ్ లాడ్జి |
| ఖమ్మం | 14.6.94 | శనివారం | హోటల్ కిన్నెర |
| వరంగల్ | 15.6.94 | ఆదివారం | విజయ లాడ్జి |
| హైదరాబాద్ | 16.6.94 | సోమవారం | హోటల్ రాజమాత |
| మహబూబ్ నగర్ | 17.6.94 | మంగళవారం | పద్మావతి లాడ్జి |
| కర్నూలు | 18.6.94 | బుధవారం | చంద్రా లాడ్జి |
| గుంతకల్ | 19.6.94 | గురువారం | హోటల్ లేపాక్షి |
| అనంతపురం | 20.6.94 | శుక్రవారం | హోటల్ భీమా |
| హిందూపురం | 21.6.94 | శనివారం | అజంతా లాడ్జి |

క్యాంపు ఉదయం 9 గంటల నుండి సాయంత్రము 5 గంటల వరకు. పరీక్ష రుసుము రు.25/-లు. పూర్తి పైకము చెల్లించి, ఔషధమును పొందవచ్చును. లేదా రు.100/- అడ్వాన్సుగా చెల్లించిన తక్కిన పైకమునకు ఔషధములు V.P.P. గా పంపబడును. కడుపు నొప్పులు, అల్సర్లు, మొలలు, మూలవ్యాధి, సోరియాసిస్, సమస్త చర్మ వ్యాధులకు ఔషధము ఈయబడును.

మార్కాపురం - 523 316.
S.T.D. No. : 08596 ఫోన్ : 2017

మేనేజరు
అమరజ్యోతి ప్రాడక్ట్స్





## గ్యాస్ట్రైటిస్ వ్యాధి బాగైనది.

ఆయుర్వేద మార్తాండ డా॥ గ్రంథే రఘురామ గుప్త గారికి,

ఆర్యా!

నేను దాదాపు 8 సంవత్సరములు గ్యాస్ట్రైటిస్ వ్యాధిచే బాధపడితిని. వ్యాధి తీవ్రమైనది. అల్లోపతి, ఆయుర్వేద ఔషధములు ఎన్ని సేవించినను ప్రయోజనము లేక పోయినది. గుండెలో మంట, కడుపుబ్బరము, అజీర్ణము, పుల్లత్రేపులు, ఎక్కువగ అపాన వాయువులు ఉండెడివి. ఏ కొద్దిగ నిమ్మపులుసు తగిలినను వ్యాధి ఎక్కువయ్యెడిది. మీ సిద్ధౌషధము 4 మాసాలు సేవించితిని. గత 30 సంవత్సరములుగ ఆ వ్యాధి మరలా కన్పించలేదు.

హ.నెం.45/24-ఆర్-30-11 — పి.దయాళ్ శరణ్,
అశోక్ నగర్, కర్నూలు. — హెల్త్ ఎక్స్టెన్షన్ ఆఫీసర్ (రిటైర్డ్)
తేది : 15.3.94

## బొల్లి, మూర్ఛ పూర్తిగ బాగైనవి.

ప్రియమైన రఘురామగుప్త గారు! పరీక్షకై మీరు పంపిన, ఔషధములు బొల్లి మూర్ఛ రోగులపై ప్రయోగించితిని. అవి చాలా బాగుగా పనిచేసినవి. వ్యాధులు అప్పటినుండి లేవు.

ఇచ్ఛాపురం — డా॥ వి.కామేశ్వరరావు,
శ్రీకాకుళం జిల్లా. — జిల్లా మెడికల్ అండ్ హెల్త్ ఆఫీసర్

## సోరియాసిస్ (మచ్చలపై పొట్టురాలే వ్యాధి) బాగైనది.

యం.సుబ్బస్వామి అను బెంగుళూరు పేషంటు, నేను మార్కాపురంలో డాక్టరుగా నున్నపుడు తన చర్మవ్యాధిని బాగుచేసికొనుటకు మార్కాపురం వచ్చెను. నేను అతనిని పరీక్షచేసి, అతడు సోరియాసిస్ వ్యాధి పీడితుడని నిర్ణయించితిని. తాను అనేక వత్సరములుగ ఆ వ్యాధి పీడితుడనని, బెంగుళూరులోని చర్మవ్యాధి నిపుణులచే చికిత్స చేయించుకొన్నాను. వ్యాధి బాగుకాలేదని అతడు చెప్పెను. సోరియాసిస్ కేసుకు సంబంధించి యిది సహజమే.

డా॥ గ్రంధే రఘురామగుప్త గారు, సిద్ధ ఆయుర్వేద వైద్యులు, 6 మాసములు ఔషధము యిచ్చినంతనే ఆ మొత్తము వ్యాధి నయమగుట చూచి చాలా ఆశ్చర్యపడితిని. చర్మము సహజస్థితికి వచ్చినది.

కనిగిరి. 18.6.80 — డా॥ బి. రామసుబ్బారెడ్డి, యం.బి.బి.యస్.,
ప్రకాశం జిల్లా. — డిప్యూటీ సివిల్ సర్జన్.

# 'ఫిజికమ్ లాబొరేటరీస్' వారి బహుమతి ప్రధానోత్సవం

విజయవాడ ప్రధాన కార్యస్థానంగా 'ఓజోమెన్' మొదలగు ప్రసిద్ధ ఆయుర్వేద ఔషధాలను ఉత్పత్తి చేస్తున్న సుప్రసిద్ధ ఫిజికమ్ లాబొరేటరీస్ వారు తమ వ్యాపారాభివృద్ధికి గణనీయంగా కృషి జేసిన వారిని గౌరవించుటకూ, వారి ప్రతినిధులుగా చేసిన విక్రయాలకు గుర్తుగా బహుమతులను ప్రధానము చేయుటకూ, ఒక కార్యక్రమాన్ని 17.4.1994వ తేదీ ఆదివారం ఉదయం పది గంటలకు విజయవాడ పట్టణము హోటల్ మమత లోని సభా భవనములో అత్యంత వైభవంగా జరిపించారు.

ఈ సందర్భంగా జరిగిన సభకు ఆంధ్ర ప్రదేశ్ ఔషధ సలహా సంఘం సభ్యులు శ్రీ రోశైరావు గారు అధ్యక్షత వహించారు. ఈ పత్రికా సంపాదకులు 'సంఘోద్ధారక', 'వైశ్యభూషణ' శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారు ఈ సభలో గౌరవ సన్మాన అతిథిగా పాల్గొన్నారు. విజయవాడ చేంబర్ ఆఫ్ కామర్సు అండ్ ఇండస్ట్రీస్ ప్రసిడెంట్ శ్రీ గద్దం సుబ్బరావు గారు ఈ సభలో ముఖ్య అతిధిగా పాల్గొన్నారు. కెమిలాయిడ్స్ చైర్మెన్ శ్రీ గంగరాజు గారు ఈ సభలో బహుమతి ప్రధాతగా పాల్గొన్నారు. ఈ వ్యాపార సంస్థ సేల్సు మేనేజరు శ్రీ వి.హనుమంతరావు గారు, సభలో పాల్గొనుచున్న గౌరవ అతిథిని, ముఖ్య అతిధిని, సభాధ్యక్షులను వారు, వారు చేసిన కృషిని సవివరంగా చెప్తూ వేదికపైకి ఆహ్వానించారు. ఈ వ్యాపార సంస్థ అధినేత శ్రీ చెక్కా చెన్నకేశవరావు గారు తమ ఈ వ్యాపారాన్ని అభివృద్ధి చేయుటకై శ్రమించిన తీరును, సాధించిన ప్రగతినీ వివరించి, తమ ఈ అభ్యున్నతికి కృషి చేసిన వారందరికీ ధన్యవాదాలు తెలిపారు.

సభాధ్యక్షులు శ్రీ రోశైరావు గారు ఇప్పటి కేంద్ర ప్రభుత్వము ఆయుర్వేద ఔషదాల ఉత్పత్తి మీద 'సెంట్రల్ ఎక్సైయిజు డ్యూటీ'ని విధించుట అత్యంత ప్రాచీనమైన మన భారతీయ వైద్యము తిరిగి తొలినాటి స్థితికి చేరుకొనుటకు ప్రతిబంధకముగుచున్న తీరును పేర్కొని, ఆయుర్వేద ఔషధాలపై విధించిన ఎక్సైయిజు డ్యూటీని తొలగించాలని కోరారు. గౌరవ సన్మాన అతిధులుగా ఈ సభలో పాల్గొన్న శ్రీ లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారు ఆయుర్వేదము యొక్క విశిష్ఠతను వివరించి, అత్యంత ప్రాచీన దశలోనే నాగార్జునుడు వంటి వారు శస్త్ర చికిత్సలు కూడ చేశారనీ, ఆయుర్వేదము వేదములు మనకు ఇచ్చిన గొప్ప సంపదలలో ఒకటి అనీ ఉగ్గడించారు. ముఖ్య అతిథి శ్రీ సుబ్బరావు గారు తమ చేంబర్ తరపున రాష్ట్రములోని వివిధ వర్తకులు ఎదుర్కొను

చున్న సమస్యలను పరిష్కరించుటకై పరిశ్రమించిన తీరును వివరించి, ఆయుర్వేద ఔషధాలపై విధించిన ఎక్సైజు డ్యూటీని రద్దు చేయించుటకు కృషి చేస్తానని అన్నారు. ఈ కార్యక్రమానికి బహుమతి ప్రధాతలుగా విచ్చేసిన శ్రీ గంగరాజు గారు ఫిజికమ్ లాబొరేటరీస్ వారు ఔషధాలను ఉత్పత్తి చేయుటలో పాటిస్తున్న పద్ధతులను, పవిత్రతను 'క్వాలిటీ' తగ్గకుండా తీసుకొనుచున్న శ్రద్ధనూ వింగడించారు. శ్రీ కె.వి.రంగా రావు గారి వందన సమర్పణతో సభ ముగిసింది. సభారంభములోనే శ్రీ హనుమంత రావు గారు ఈ వ్యాపార సంస్థ 'ఫీల్డు స్టాఫ్'ను పేరునా, పేరునా పిలిచి తమ ఈ సంస్థ అభివృద్ధికి వారు చేసిన కృషిని వివరించారు.

ఫిజికమ్ లాబొరేటరీస్ ప్రొప్రయిటర్ శ్రీ కేశవరావు గారు సభాధ్యక్షులనూ, గౌరవ అతిథిని, ముఖ్య అతిథినీ, బహుమతి ప్రధాతనూ ఘనంగా సత్కరించి జ్ఞాపికలను సమర్పించారు.




ప్రసిద్ధ కవులు, గుంటూరు జిల్లా గామాలపాడు వాస్తవ్యులూ, శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి గారి కుమారులు చి॥ అనంత రామారావు, యం.యస్.సి.(అగ్రి), ఎ.ఆర్.ఎస్., గారి వివాహం, యల్.బి. నగర్ శ్రీ బానూరి మదుసూధనరావు గారి కుమార్తె చి॥ మంజుల, యం.యస్.సి., (పి.హెచ్.డి.) గారితో 24.4.1994వ తేదీన సంగారెడ్డి లోని రెవిన్యూ గెస్ట్ హౌవుస్‌లో వైభవంగా జరిగింది.

అనంతపురం జిల్లా హిందూపురం వైశ్య ప్రముఖులు శ్రీ వి.యల్. సుబ్రమణ్యం గారి కుమారులు చి॥ మురళీధర్, బి.కాం., గారి వివాహం పాల సముద్రం శ్రీ మట్టా రామయ్య గారి కుమార్తె చి॥ రాధ, బి.ఎ., తో 1-5-1994వ తేదీన హిందూపురం లోని శ్రీ వాసవీ ధర్మశాలలో వైభవంగా జరిగింది.

అనంతపురం జిల్లా ధర్మవరం వైశ్య ప్రముఖులు శ్రీ పిన్నా రామకృష్ణ హరి ప్రసాద్ గారి కుమార్తె చి॥ చంద్రలత వివాహం, ఆదవేణి శ్రీ పాడెగల్లు రామాంజనేయులు గారి కుమారులు చి॥ శ్రీధర్, బి.కాం., గారితో 28.4.1994వ తేదీన ధర్మవరము లోని శ్రీ వాసవీ కల్యాణ మంటపములో వైభవంగా జరిగింది.

*గమనిక* :— ఈ శీర్షికన ప్రకటన కావాలను కునే వారు వివాహ శుభ లేఖతో బాటు రూ.116/-లు యం.ఓ. ద్వారా గానీ, డి.డి. ద్వారా గానీ పంపాలి.

**జీవిత సభ్యత్వ చందా**
**రూ.400/-**

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.5.1994 నుండి 20.6.1994 వరకు)

31.3.1994వ తేదీతో లెక్కలు ముగించిన అసెసీలు తాము రూ.2500/-లకు మించి వడ్డీ చెల్లించునపుడు పట్టుకొన్న పన్ను మొత్తాన్ని 31.5.1994వ తేదీ లోగా ప్రభుత్వ ఖజానాలో జమకట్టాలి.

1993-1994 ఆర్థిక సంవత్సరములో ఆదాయము పన్ను విధింపునకు అర్హమగు ఆదాయము వచ్చు క్రొత్త అసెసీలు గత సంవత్సరము రూ.50,000/-లకు మించి ఆదాయము వచ్చి యుండియూ పర్మనెంటు నెంబరును పొందనివారు తమంతట తామే ఫారము నెం.40ఎను పూర్తిచేసి అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి 31.5.1994వ తేదీలోగా చేరునట్లుగా పంపాలి.

మీరు పంపవలసిన A-2 రిటర్న్లను చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖ అధికారికి పంపుటకు జూన్ నెల 20వ తేదీయే చివరిది. మీరు పంపు ఆ A-2 రిటర్న్లను చలానాతో బాటు కాకుండా, చెక్కుతో బాటు పంపాలను కుంటున్నారా? ఆ విధంగా ఆ A-2 రిటర్న్లను చెక్కుతోబాటు పంపుటను జూన్ నెల 15వ తేదీ లోగానే చేయాలి. ఈ విషయాన్ని మరచిపోకండి.

## నిత్యావసర వస్తువులపై పన్నులను తీసివేయాలి

– ప్రభుత్వానికి కనమర్లపూడి విజ్ఞప్తి

రోజు రోజుకూ పెరుగుచున్న నిత్యావసరవస్తువుల ధరలను సమీక్షించి, ఈ పెరుగుదల బడుగు వర్గాల, మధ్యతరగతి వారల జీవనవ్యయాన్ని రోజు రోజుకూ దుర్భరం చేస్తున్నాదన్న సత్యాన్ని గుర్తించిన, ఢిల్లీ, గుజరాత్, మహారాష్ట్ర పశ్చిమ బెంగాల్, మధ్యప్రదేశ్ రాష్ట్రాల ప్రభుత్వాలవారు నిత్యావసర వస్తువులపై గల అన్ని రకాల పన్నులనూ తీసివేసి సదరు వస్తువుల ధరల పెరుగుదలను అదుపులోనికి తేగలిగారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము కూడ మన రాష్ట్రములో నిత్యావసర వస్తువులపై తాను విధించిన అన్ని రకాల పన్నులనూ వెంటనే తీసివేసి ధరల పెరుగుదలకు కళ్ళెం వేసి, తద్వారా ఈ రాష్ట్రములోని బడుగువర్గాలు మరియు మధ్య తరగతి వారలను ఆదుకోవాలని గుంటూరు డాల్ మిల్లర్స్ అసోసియేషన్ జనరల్ సెక్రటరి శ్రీ కనమర్లపూడి గాంధీ కోటేశ్వర రావు గారు ఈ మధ్య విడుదల చేసిన ఒక పత్రికా ప్రకటన ద్వారా ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరారు.

## ప్రదేశ్ వ్యవసాయేతర భూముల పన్ను నిర్ధారణ. చట్టము 1993 (1994లో 8వ చట్టము)

ఇప్పుడు అమలులో ఉన్న పై చట్టమును సవరిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము 24.12.1993వ తేదీన ఒక బిల్లును 1993లో 21వ శాసనసభ బిల్లుగా శాసన సభలో ప్రవేశపెట్టింది. ఈ బిల్లు సభ ఆమోదమును పొంది 1994లో 8వ చట్టమైంది. 1.7.1993వ తేదీ నుండి అమలునకు వచ్చింది. 3.2.1994వ తేదీన వెలువడిన ఆంధ్రప్రదేశ్ రాజ పత్రములో ఈ శాసనము ప్రకటించబడింది.

పై చట్టాన్ని అమలుపరచుటకు మునుపటి తహాశీల్దార్లకుగల అన్ని అధికారాలు ఈ సవరణ ఫలితంగా మండల రెవిన్యూ ఆఫీసర్లకు సంక్రమించినవి.

ఈ సవరణ ద్వారా రాష్ట్ర ప్రభుత్వము వ్యవసాయేతర భూములపై విధించుచున్న పన్నురేట్లను ఈ క్రింది విధంగా సవరించింది.

<u>అనుసూచి</u>

(3వ పరిచ్ఛేదము చూడుము)

| స్థానిక ప్రాంతము మరియు కడపటి జనాభా లెక్కల ప్రకారము దాని జనాభా | ఉపయోగించిన భూమికి సంబంధించి చదరపు మీటరు ఒక్కొంటికి పన్ను నిర్ధారణ రేట్లు | | |
|---|---|---|---|
| | పారిశ్రామిక ప్రయోజనము కొరకు ఫసలి సంవత్సరం ఒక్కొంటికి | వాణిజ్య ప్రయోజనానికి ఫసలి సంవత్సరం ఒక్కొంటికి | నివాస ప్రయోజనముతో సహా ఏదేని ఇతర వ్యవసాయేతర ప్రయోజనానికి ఫసలి సంవత్సరం ఒక్కొంటికి |
| (1) | (2) | (3) | (4) |
| 1. 10,000 మరియు అంతకంటె తక్కువ జనాభా గల స్థానిక ప్రాంతము | 50 పైసలు | | |
| 2. 10,000 మించిన అయితే 15,000 మించని జనాభా గల స్థానిక ప్రాంతము | 50 పైసలు | 25 పైసలు | |
| 3. 15,000 మించిన అయితే 50,000 మించని జనాభా గల స్థానిక ప్రాంతము | 50 పైసలు | 50 పైసలు | 15 పైసలు |
| 4. 50,000 మించిన అయితే 2 లక్షలకు మించని జనాభా గల స్థానిక ప్రాంతము | 75 పైసలు | 75 పైసలు | 25 పైసలు |
| 5. 2 లక్షలు మించిన జనాభా గల స్థానిక ప్రాంతము | 100 పైసలు | 100 పైసలు | 25 పైసలు |



PHILIPS












